# ఆంధ్రమహిళ

(సాంఘికాభ్యుదయ మాస పత్రిక)



ANDHRA MAHILA

# మెట్రిక్ తూకాలు నేటినుండి నిర్బంధంగా అమలు

1960 అక్టోబరు 1 వ తేదినుండి యీ దిగువ పేర్కొనబడిన ప్రాంతాలలో అన్ని వ్యాపారాల లోను మెట్రిక్ తూకాలను మాత్రమే ఉపయోగించాలి. మెట్రిక్ తూకపు రాళ్ళన్నిటిపైన అధికార ముద్ర ఉండాలి. ఇంకేతూకాలను ఉపయోగించినా, చట్టవిరుద్ధం కాగలదు.

ఆంధ్రప్రదేశ్ : విశాఖపట్టణం, కృష్ణా. గుంటూరు, కర్నూలు, హైదరాబాదు, వరంగల్లు నిజామాబాద్; జిల్లాలు, రాష్ట్రంలోని అన్ని క్రమబద్ధ మార్కెట్లు.

అస్సాం : నౌగాంగ్ జిల్లా, గౌహతీ నగరం.

బీహారు : భాగల్పూర్, రాంచి డివిజన్లు; పాట్నా:- తీర్ హట్ డివిజన్లలోని మునిసిపల్, నిర్దేశితప్రాంతాలు.

గుజరాత్ : అహ్మదాబాద్, రాజ్ కోట్, బరోడా నగరాలు; రాష్ట్రంలోని అన్ని క్రమబద్ధ మార్కెట్లు.

కేరళ : కోజికోడ్, ఎర్నాకులం, క్విలన్ జిల్లాలు.

మధ్యప్రదేశ్ : సెహూర్, ఇండోర్, గ్వాలియర్, జబ్బల్పూర్-జిల్లాలును, రాష్ట్రింలోని క్రమబద్ధమైన మార్కెట్లును.

మద్రాసు : మద్రాసు, చెంగల్పట్టు, దక్షిణ ఆర్కాటు, ఉత్తర అర్కాటు-జిల్లాలు. రాష్ట్రింలోని అన్ని క్రమబద్ధ మార్కెట్లు.

మహారాష్ట్ర : బొంబాయి; పూనా; నాగపూరు, ఔరంగాబాదు, షోలాపూరు, అకోలా, అమరావతి. వార్ధా, యోత్మల్ - నగరాలు, రాష్ట్రింలోని అన్ని క్రమబద్ధ మార్కెట్లు.

మైసూరు : బెంగుళూరు, రాయచూరు, ధార్వార్ జిల్లాలు. రాష్ట్రింలోని అన్ని క్రమబద్ధ మార్కెట్లు.

ఒరిస్సా : బరంపురం, కటకం, సంబల్పూర్-నగరాలు.

పంజాబు : అమృతసర్. జలంధర్, లూడియానా, అంబాలా, పాటియాలా, గుర్గాం- జిల్లాలు, రాష్ట్రిం లోని అన్ని క్రమబద్ధ మార్కెట్లు.

రాజస్థాన్ : అజ్మీర్, బికనీర్, జోద్పూరు. జైపూరు, కోటా. ఉదయపూర్ జిల్లాలు.

ఉత్తరప్రదేశ్ : మీరట్, ఆగ్రా, లక్నో, బెరెల్లీ, మొరాదాబాద్, వారణాసి, కాన్పూరు, ఝాన్సీ, అలహాబాద్, గోరక్ పూర్ నగరాలు.

పశ్చిమ బెంగాలు : కలకత్తా,హౌరామునిసిపల్ ప్రాంతాలు

ఢిల్లీ : ఢిల్లీ, అంతటా,

హిమాచలప్రదేశ్ : మండీ, సిర్మూర్ జిలాలు.

మణిపూరు : ఇంఫాల్ నగరం.

త్రిపుర : అగర్తలా నగరం.

అండమాన్, నికోబార్ దీవులు ; పోర్ట్‌బ్లయర్ నగరం.

పుదుచ్చేరి : పుదుచ్చేరి అంతటా.

★

ఈ మెట్రిక్కు తూకాలపద్ధతి ముఖ్యంగా ఈ క్రింది సరకులలావాదేవీలలో, చట్టరీత్యా నిర్బంధం అయిందని తెలుసుకోవాలి.

సరకులు : జనుము, దూది, నేతబట్టలు, ఇనుము, ఉక్కు, యంత్రాలు, భారీరసాయనాలు, సిమెంటు, ఉప్పు, కాగితం, ఇనునుచేరని యితరలోహాలు, రబ్బరు సరుకులు, వనస్పతి, సబ్బులు, ఉన్ని ఉడుపులు, కంట్రోలు పొందిన మార్కెట్ల దూది, కాఫీ బోర్డు లావాదేవీగల కాఫీగింజలు.

## మెట్రిక్ పద్ధతి

అంతటా ఒకే పద్ధతి, ఎంతో సులభమైనది.

భారత ప్రభుత్వం వారిచే జారీచేయబడింది

# మాచందాదారుల కొకమనవి

## "ఆంధ్రమహిళ"

"ఆంధ్రమహిళను" కడచిన 16 సం॥ రములనుండి ఇంతవఱకు మహిళాభ్యుదయకరాలైన అనేక విషయాలతో సక్రమంగా ప్రతినెల అందజేస్తూ వచ్చాం. కాని, అనివార్య కారణాంతరాలవల్ల ఈ సెప్టెంబరు, అక్టోబరు, నెలల సంచికలు ప్రచురింపజాలనందుకు చింతిస్తూ, ఆ రెండు నెలల చందాలను ఇకమీద రాబోవురెండునెలలకు సరిపెట్టుకోగలమని విన్నవిస్తున్నాం.

ఇంతటినుండి "ఆంధ్రమహిళ" యథాప్రకారం సర్వాంగ సుందరంగా మహిళాలోక సంక్షేమకరాలైన ఉత్తమ వ్యాసాలతో ప్రతినెల వెలువడే యేర్పాట్లు చేశాం. ఎప్పటిమోస్తరే మా చందాదారులు అనురాగాభిమానాలతో "ఆంధ్రమహిళ"ను ఆదరింపగలరని అభ్యర్థిస్తున్నాం.

బి. తిమ్మాబాయి
సంయుక్తకార్యదర్శిని.
" ఆంధ్ర మహిళా సభ "

# ఆంధ్రమహిళ

## విషయ సూచిక

# గ్రామీణ ప్రాంతాల స్త్రీల బాలుర సంక్షేమం

శ్రీమతి పి. పారిజాతం నాయుడు.

శ్రేయోరాజ్యంలో సాంఘిక సంక్షేమ పథకాలు సాధారణంగా సాంఘికంగా వెనుకబడివున్న వారికోసం, దుర్బలులైన వారికోసమూ ఉద్దేశింప బడినా, మొత్తంమీద సంఘంయావత్తూ వీటివల్ల లాభంపొందింది, దేశపురోగమనానికి తోడ్పడతాయనడంలో సందేహం ఏమీలేదు. దుర్బలులు, అంగవైకల్యం, పొందినవారు, మానసికంగానూ, శారీరకంగానూ అనారోగ్యవంతులైనవారు సంక్షేమంద్వారా, ఇతరులమీద ఆధారపడ వలసిన అవసరం తగ్గి, సంఘం పురోగమించడానికి తగిన వాతావరణం ఏర్పడుతుంది. ఈ దృక్పధంతో చూసినట్లయితే ఉత్పత్తి కార్యక్రమాలలో సాంఘిక సంక్షేమం ఎంత ముఖ్యమైనపాత్ర వహిస్తుందో విశదమౌతుంది.

సాంఘిక సంక్షేమం ముఖ్యోద్దేశం సాంఘికంగా, ఆర్థికంగా, శారీరకంగా, మానసికంగా వెనుకబడివున్న వ్యక్తులకు సంఘంలో ఇతరులకు లభించే సౌకర్యాలను కలుగజేయడం. ఈ విధంగా "దుర్బలు"లైన వారికీ, ముఖ్యంగా ఒకరిమీద అధారపడివుండే పిల్లలకీ, స్త్రీలకీ, సంక్షేమ పథకాలు తీర్చిదిద్దబడినాయి. వీటిలోకూడ, గ్రుడ్డి, చెవిటి, మూగ మొదలైన అంగ వైకల్యానికి లోనైన వారికి "నివారణ పథకాలు" దిక్కులేనివారు, వితంతువులు, అనాధ బాలురు, పిచ్చివారు, సంఘ వ్యతిరేకచర్యలైన దొంగతనం, వ్యభిచారం మొదలైననేరాలు చేసేవారికి "నిరోధక పథకాలు" అవలంబించ వలసివుంటుంది. పైవాటినిబట్టి సంక్షేమ రాజ్యంలోకూడ ఇలాంటి పథకాల అవసరం ఎల్లప్పుడూ వుంటూనే వుంటుందనే విషయం విదితమౌతూంది.

అంతకు ముందే అంగవైకల్యానికి లోనైన వారికి "నివారణ పథకాలు" తోడ్పడగా, ముందు ముందు సంఘంలో దొంగతనం, వ్యభిచారం మొదలైన దురలవాట్లు వ్యాప్తిచెందకుండా "నిరోధక పథకాలు" ఎంతైనా అవసరం. ఈ రెండుకూడా ఆధునిక సంక్షేమ పథకాలకి పట్టుకొమ్మలలాంటివి. గ్రామీణ ప్రాంతాలలోని నిరుద్యోగ సమస్య మరింత క్లిష్టతరమవడంచేత అక్కడి సాంఘిక జీవితాన్ని కలుషితం కాకుండా చేయడానికి ఈ నిరోధక పథకాల అవసరం ఎంతైనావున్నది. ముఖ్యంగా కుటుంబాన్ని ఒక "పరిమాణం"గా తీసుకొని పట్టణాలలో తక్కువ ఆదాయాలువచ్చే కుటుంబాలు, మురికిపేటలలో వుండేవారు, గ్రామీణ ప్రాంతాల ప్రజలు పారిశ్రామిక వాడలలో ప్రజలు, వీరిలో పై పథకాలని అమలు జరపవలసివున్నది. దీనిద్వారా సంఘానికి మహోపకారం జరుగుతుంది.

ఈ వ్యాసంలో స్త్రీలకీ, బాలురకీ, 'నిరోధకపథకాల' ద్వారా సాంఘిక సంక్షేమ కార్యకలాపాలను సమీక్షించడానికి ప్రయత్నం జరిగింది. సాంఘికాభివృద్ధి, సహకార మంత్రిత్వశాఖవారు ప్రత్యేకము, స్త్రీల, శిశువుల సంక్షేమ పథకాలకి ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చి, తద్వారా సంఘం మొత్తంమీద పురోగమనాన్ని సాధించడానికి ప్రయత్నాలు సాగిస్తున్నారు. ఈ ప్రయత్నాన్ని ముఖ్యంగా స్త్రీలు బాగా అర్థంచేసుకొని, సహకరించినట్లయితే ముందు ముందు సంఘం ఎంతో ప్రగతిని సాధిస్తుందనడంలో సందేహం లేదు. ఈ ప్రభుత్వ ప్రయత్నానికి పంచాయితీ సమితులు, ఐచ్ఛిక సంస్థల సహకారాన్ని కూడగట్టుకొని, తోడ్పడవలసి వున్నది.

మన రాజ్యాంగం, ఇటీవల అనేకచట్టాలు, స్త్రీకి వారసత్వపు హక్కుల్ని, వివాహ విషయాలలో అనేకరక్షణలని, సమాన ప్రతిపత్తిని ప్రతిపాదిస్తున్నాయి. జనాభాలో దాదాపు సగభాగం వున్న స్త్రీల సంక్షేమం దేశాభివృద్ధికి, దేశ పురోగమనానికి ఎంతో ముఖ్యమైన విషయం. రాజ్యాంగం స్త్రీలకి ఇన్ని రక్షణలు కల్పించినా, ఇంకా స్త్రీలు అనేక ఇబ్బందులకు లోనౌతూనే వున్నారు. అందుచేత ఈ సంక్షేమప్రణాళికలలో ఎక్కువభాగం స్త్రీల ఉపయోగం కోసమే ఉద్దేశింప బడినాయి: స్త్రీలను విద్యావతులుగా చేయడంద్వారా ఈ ఇబ్బందులు కొంతవరకేనా తీరుతాయి. నిరక్షరాస్యత ఎక్కువగావున్న మనదేశంలో, స్త్రీలలో నిరక్షరాస్యులైనవారి సంఖ్య మరింత ఎక్కువగా వుంది: అందుచేతనే తృతీయ పంచవర్ష ప్రణాళికలో బాలికలకి విద్యాబోధన సౌకర్యాలు మరింతగా కల్పించాలని నిశ్చయింపబడింది. కుటుంబాలలో అనేక సమస్య

వల్ల, తమ చదువును పూర్తి చేయలేక మధ్యలో విద్యాభ్యాసానికి అంతరాయంకలిగి చదువు మానివేసిన వారికి, పాఠ్యక్రమాన్ని కుదించి, తక్కువ వ్యవధిలో చదువు పూర్తిచేసుకునే అవకాశాలు కల్పించి, ప్రాథమిక పాఠశాలల ఉపాధ్యాయినులుగా, "బాల్‌వాడీల"లో పనిచేసే ఉపాధ్యాయినులుగా, గ్రామసేవికలుగా, మంత్రసానులుగా తర్ఫీదుఇవ్వడం ఎంతైనా అవసరం. ప్లానింగ్ కమీషన్ వారు ఇటీవల సేకరించబడిన వివరాలనుబట్టి గ్రామీణ ప్రాంతాలలో పని చేయడానికి తగినంత మంది "ఫీల్డ్ వర్కర్స్" లేనట్లుగా తేలింది. వీరి తర్ఫీదుకి పాఠ్యక్రమాన్ని కుదించి 22–35 సంవత్సరాల మధ్యవయస్సు గల స్త్రీలని తయారుచేసినట్లయితే ఈ లోటు చాలా భాగం తీరుతుంది. కేంద్రసాంఘిక సంక్షేమ సంస్థవారు మూడవ ప్రణాళికలలో ఈ తర్ఫీదు ఏర్పాట్ల నిమిత్తం కొంతసొమ్ముని కేటాయిస్తున్నట్లు తెలియ వచ్చింది.

గ్రామీణ ప్రాంతాలలోని మహిళలకు, బాలికలకూ, విస్తరణపథకాల ద్వారా గృహ నిర్వహణ విషయంలో తర్ఫీదు నివ్వడం, వారివారి వృత్తులలోను, వ్యవసాయంలోను శాస్త్రీయమైన పద్ధతులను అమలుపరచుకొనేటట్లు తోడ్పడటం ఎంతైనా అవసరం. ఇంటింటికీ వెళ్ళి, వారి కష్టసుఖాల్ని తెలుసుకొనడం ద్వారానూ, కుటుంబ, సంక్షేమ పథకాల ద్వారానూ, సాంఘికసంక్షేమ కేంద్రాల ద్వారానూ ఈ ఫలితాన్ని సాధించడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఆదర్శ గృహిణులుగా, తల్లులుగా, పౌరులుగా, తయారవడానికి స్త్రీలకి ఏర్పాటు చేయబడిన ఈ సంక్షేమ పథకాల ప్రాధాన్యం గుర్తింపబడటం ముదావహం.

ఈలాంటి పథకాల విజయం కొన్ని ముఖ్యవిషయాల మీద ఆధారపడి వుంటుంది. ఈలాంటి పథకాల వివిధ సమస్యలు ఒకదానిమీద ఒకటి ఆధారపడి వుంటాయి. వీటిని వేరువేరుగా పరిగణించకుండా, తర్ఫీదు పొందేవారూ, గ్రామసేవికలు, బ్లాకుడెవలప్‌మెంటు అధికారులు కలిసికట్టుగా పనిచేస్తేనే, విజయవంతంగా ఈ పథకాన్ని అమలుపరచ గలుగుతారు. ఈ సందర్భంలో సమాజాభివృద్ధి మంత్రిత్వశాఖవారు ముఖ్యసేవికలకీ తమ తమ విధులను, బాధ్యతలను వివరిస్తూ ఒక 'కరపత్రాన్ని' ప్రచురింప బోతూన్నారు, ఈ కరపత్రం వీరికి సహాయకారిగా వుండటమే కాకుండా, తర్ఫీదు పద్ధతులలోకూడా వారికి ఎంతగానో తోడ్పడుతుందనడంలో సందేహం లేదు. ఒక పథకాన్ని అమలుపరచడంలో ఉన్న వివిధ సమస్యల్ని అర్థంచేసుకొనడం మాత్రమే సరిపోదు. ఆయా ప్రాంతాల స్థానికపరిస్థితుల్నిబట్టి ఆయా సమస్యల్ని బాగా ఆకళింపు చేసుకొని ఏ విధానం అనుసరిస్తే బాగుంటుందనే విషయంమీద ఒక నిర్ణయానికి రావాలి. ప్రస్తుతం తర్ఫీదుపొందిన గ్రామసేవికల సంఖ్యనుబట్టి రెండు గ్రామాలకి ఒకరిని కాదుకదా, నాలుగైదు గ్రామాలకి ఒకరిని నియమించడానికి కూడా వీలుపడదు. అందుచేతనే గ్రామసేవకులతో సమానంగా గ్రామసేవికలకి కూడా ఒక్కొక్కరికి పదిగ్రామాలు కేటాయించ వలసివస్తుంది. ఈ పరిస్థితులదృష్ట్యా సాంఘికాభివృద్ధి మంత్రిత్వశాఖ వారు ఒక కొత్తపథకాన్ని రూపొందించు తున్నారు. దీని ప్రకారం ఇద్దరిద్దరు గ్రామసేవికలు, ముఖ్యసేవికలు కలసి ఒక బృందముగా మూడు నాలుగు గ్రామాలలో ఆరునెలలపాటు పనిచేస్తారు. ఆ తరువాత ఈ విధంగానే ఇంకొక మూడు నాలుగు గ్రామాలుగల ఒక బ్లాకును, ఎన్నుకొని అక్కడ పనిచేస్తారు. ఈ సంచార కార్యక్రమంద్వారా వారు ఎన్నో సంగతులు తెలుసుకుంటారు, ఎంతో అనుభవం గడిస్తారు. వారిలో ఆత్మవిశ్వాసం, ధైర్యం పెంపొందుతుంది. ఆయా గ్రామాలలో వుండే ఉత్సాహవంతులైన మహిళలకు తమ ఆశయాలను నచ్చచెప్పడం, వారుకూడా ఈ కార్యక్రమంలో ఉత్సాహంగా పాల్గొనేట్లు చేయడంలోనే ఈ ఉద్యమం యొక్క విజయం ఆధారపడి వుంది. ఆయా ప్రాంతాలలో వుండే మహిళా సమాజాలు ఈ విషయంలో చేయవలసినదీ చేయగలిగినదీ ఎంతైనావుంది. ఈ మహిళా సమాజాలలోని ఉత్సాహవంతులు ముందుకు వచ్చి, మహిళలకు శిక్షణ శిబిరాలను ఏర్పరచి తక్కువ వ్యవధిలో పూర్తి అయే తర్ఫీదుద్వారా గ్రామసహాయక దళాలను తయారు చేయ వచ్చును. ప్రాంతాలలోవుండే మహిళా మండలులు మరింత ఉత్సాహంగా పనిచేసేటట్లు చూసే బాధ్యతకూడా వీరిపైన వున్నది.

"జాతీయ సేవావిధానం" అనే కొత్త కార్యక్రమం ద్వారా సుమారు 20 మంది విద్యార్థినులు గ్రామీణప్రాంతాలలో తొమ్మిదినెలలపాటు పనిచేస్తారు. ఈవిధానం సవ్యంగా అమలు జరిగినట్లయితే గ్రామీణ ప్రాంతాలలోని స్త్రీలకూ, పిల్లలకూ ఉపకారమే జరగడమే కాకుండా, ఈ విద్యార్థినులకు కూడా క్రమశిక్షణ, అనుభవం బాగా కలుగుతుంది.

ఆర్థికంగా కూడా గ్రామీణప్రాంతాలలో వుండే తక్కువరాబడి గల కుటుంబాలకు ఉపకారం జరిగే విధంగా

గ్రామీణ పరిశ్రమలను నెలకొల్పి, ప్రోత్సహించ వలసి వుంది. ముఖ్యంగా స్త్రీలకు ఖద్దరులాంటి గ్రామీణ పరిశ్రమలద్వారా తమఆదాయాన్ని వృద్ధిపరచుకొనే అవకాశం ఎంతైనా వుంది. ఈ సమస్యమీద అఖిలభారత సంస్థలు, ఆయా రాష్ట్రాలకు చెందిన పరిశ్రమల మంత్రిత్వశాఖలు ఒక ప్రణాళికను రూపొందించి, కొన్ని గ్రామాలు ఒక "యూనిట్"గా పరిగణించి, వాటికిసమీపంలో అందరికీ అందుబాటులో వుండేటట్లు ఈ పరిశ్రమలను నెలకొల్ప వలసివుంది.

ఇక గ్రామీణ ప్రాంతాలలో పిల్లల సంక్షేమ విషయంలో చేయవలసినది ఎంతైనావుంది. 1959 వ సంవత్సరాంతానికి 3,536 'బాలవాడీలు' పనిచేస్తున్నాయి. వీటి ద్వారా 79,681 మంది పిల్లలు ఉపయోగం పొందుతున్నారు. ఈ బాలవాడీలలో అనుసరించే విధానాలలో ఎంతో అభివృద్ధి జరగవలసివుంది. మూడవ ప్రణాళికలో 6–11 సంవత్సరాల వయస్సుగల పిల్లల సంక్షేమానికి ప్రాధాన్యం ఇచ్చినా, రెండున్నర – 6 సంవత్సరాల వయస్సు పిల్లల సంక్షేమాన్ని ఉపేక్షచేయరాదు. గ్రామీణప్రాంతాలలో "క్రెచీల," "బాలవాడీల" ద్వారా బాలుర సంక్షేమానికి చేయవలసిన బాధ్యత ఎక్కువగా గ్రామ సేవికలపైననే వుంది. కొన్ని ముఖ్య గ్రామ కేంద్రాలలోనూ, ఎన్నుకొనబడిన బ్లాక్ ప్రాంతాలలోనూ, బాలుర సంక్షేమపథకాలను పరిశోధనాత్మకంగా నిర్వహించి, ఫలితాలను చూడవలసి వున్నది. ఈ పరిశోధనా కేంద్రాలలో ఈ క్రింది కార్యక్రమాన్ని అమలు పరచవలెను.

1. తల్లులు పొలాలలోగాని, మరే ఇతర వృత్తులలోగాని పనిచేయడానికి వెళ్ళినప్పుడు, 3 సంవత్సరాలలోపు పిల్లల సంరక్షణకి క్రెచీలను ఏర్పాటు చేయడం.

2. ఆరోగ్యకేంద్రాలు, మాతా శిశుసంరక్షణాలయాలు, కుటుంబ ఆరోగ్యసలహా కేంద్రాలు ఏర్పాటు చేయడం.

3. 3–6 సంవత్సరాల పిల్లలకి బాలవాడీలు నిర్వహించడం.

4. పాఠశాలలకు వెళ్ళే పిల్లలకు క్రీడా కేంద్రాలు, సాంస్కృతిక కార్య కలాపాలను ఏర్పాటు చేయడం, విజ్ఞానయాత్రలు చేయించడం, వారివారి అభిరుచులకు అనుగుణంగా ఆట పాటలకు అవకాశాలు కల్పించడం.

5. పాఠశాలలలో చదివే విద్యార్థులకు ఆరోగ్యసౌకర్యాలు ఏర్పాటు చేయడం.

6. శిశు కేంద్రాలలోను, క్రెచీలలోను, బాలవాడీలలోనూ, పాలపంపకం, మధ్యాహ్న భోజనాలు, ఏర్పాటు చేయడం.

7. ఉపాధ్యాయుల, సంరక్షకుల సంఘాలను నిర్వహించడం.

8. పాఠశాలలలోను, "కమ్యూనిటీసెంటర్స్" లోనూ బాలభట సంఘాలను ఏర్పాటు చేయడం.

9. గ్రామీణ వాతావరణానికి తగినట్లు యువజన క్రీడా కేంద్రాలను నిర్వహించడం.

10. పాఠశాలలలో ఇతోధికంగా బాలబాలికలను చేర్చే ఉద్యమానికి తోడ్పడటం.

11. శారీరకంగానూ, మానసికంగానూ, వెనుకబడి వున్న పిల్లలకి ప్రత్యేక సంరక్షణ, అవసరమైన పిల్లలకి, సేవాకార్యక్రమాన్ని ఏర్పాటు చేయడం.

సువిశాలమైన మన దేశంలో గ్రామీణ ప్రాంతాలలో నివసించేవారే ఎక్కువమంది. అందులో స్త్రీలు నూటికి ఏభైమంది కంటె ఎక్కువ. అందుచేత పైన వివరించిన ఏ కార్యక్రమాలు తలపెట్టినా వాటి విజయం స్త్రీలమీదనే ఆధారపడి వుంది. సాంఘికంగానూ, ఆర్థికంగానూ ఉన్న తరగతిలో వున్న స్త్రీలు, తమకంటె వెనుకబడివున్న తమ సాటివారి సేవకి నడుంకట్టి వారి కష్ట సుఖాల్ని పంచుకోడానికి ముందుకు వస్తేనే మనదేశానికి మంచి భవిష్యత్తు సత్వరపురోభివృద్ధి సాధ్యం అవుతుంది. స్త్రీలకి స్త్రీలే సాయం చేసుకోవాలి.

---

# హైదరాబాద్ (భర్కత్ పురా) ఆంధ్రమహిళా సభ

## దసరా ఉత్సవాలు

1960 సెప్టెంబరు 28 తారీఖునుండీ, అక్టోబరు 3-వ తారీఖు వఱకు సభవారు దసరా మహోత్సవాల్ని అతివైభవంగా సభా భోజన శాలా ఆవరణంలో జరిపారు. శ్రీమతి చంద్రమతీదేవిగారు ఈ ఉత్సవాలకి అధ్యక్షత వహించారు. శ్రీమతి యస్. యన్. రెడ్డిగారు ప్రాంతీయ చేతిపరిశ్రమ శిక్షణాలయంలో తర్ఫీతు పొందుచున్న వారిచే తయారు చేయబడ్డ వస్తుప్రదర్శనానికి ప్రారంభోత్సవం చేశారు.

ఆ- ఆవరణంలోనే బొమ్మల కొలువు కూడా పెట్టబడింది. శిక్షణాలయంలో అభ్యాసం పొందే వారు, ఉపాధ్యాయినీవర్గంవారు ఉదయ సాయంకాలాల్లో జరిగే పూజలకు సక్రమంగా తప్పక హాజరయ్యేవారు.

వారికి ఈ ఉత్సవ దినాల్లో — 'రింగు టెన్నిస్ -' 'త్రోబాల్ '- 'బాల్ బాడ్మింటన్' షెటిల్ బాడ్మింటన్, 'మ్యూసికల్ చేర్' మున్నగు ఆటలలో పోటీలు పెట్టబడ్డాయి. రంగవల్లులు (ముగ్గుల్లో) కూడా పందెములు జరిగినాయి.

ఇక కళా ప్రదర్శనానుగుణంగా, నాటకాలు, నృత్యాలు, హాస్యాలు, చిత్ర విచిత్ర వస్త్రధారణవైఖరులు - మొదలయినవి కూడ ప్రకటింప బడ్డాయి. ముఖ్యంగా చేతిపనులకు సంబంధించిన ప్రదర్శనాల్లో. తదభ్యాసశాలలోని విద్యార్థినులు పాల్గొంటే, కళా ప్రదర్శనాల్లో విద్యా సంస్థకు సంబంధించిన విద్యార్థినులు పాల్గొన్నారు.

ఈ విధంగా ఆయా పందేలలోను, కళా ప్రదర్శనాలలోను గెలుపుపొందిన వారికి శ్రీమతి డా॥ కొండా శకుంతలాదేవిగారి అగ్రాసనాధిపత్యంక్రింద జరిగిన సభలో 30-9-1960 న శ్రీమతి శేషాచలపతిగారు బహుమతులు పంచిపెట్టారు. అక్టోబరు 2వ తారీఖున గాంధిజయంతి కూడ ఈసభా యాజమాన్యముక్రింద ఉదయం 8-30 గంటలకు జరుపబడింది. శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు అధ్యక్షత వహించారు. గాంధీజీ జీవితంలోని కొన్ని ఘట్టాల్ని స్పృశిస్తూ ఆమెగారు విద్యార్థినీ జనానికి ఉత్సాహకరంగా ఉపన్యసించారు. తరువాత 9 గం॥నుండి 10-30 గం॥ వఱకు సూత్రయజ్ఞం జరుపబడింది.

అనంతరం. ఆంధ్ర మహిళా సభా కార్యదర్శిని అయిన శ్రీమతి కె. సుగుణమణిగారి సభాభివందనములతోను, 'జనగణమన'- జాతీయ గీతంతోను ఉత్సవము ముగిసినది.

---

## స్వాతంత్ర్య దినోత్సవం

బరకత్‌పురాలోని ఆంధ్రమహిళాసభ వసతిగృహంలో ఆగస్ట్ 15 వ తేదీన స్వాతంత్ర్య దినోత్సవం వైభవంగాజరిగింది. శ్రీమతి టి. లక్ష్మీకాంతమ్మ, ఎమ్. ఎల్. ఎ. పతాకావిష్కరణ గావించారు. అనంతపురం ఎమ్. ఎల్. ఎ. శ్రీమతి రుక్మిణమ్మ, భద్రాచలం ఎమ్. ఎ్.ఎ ఎ. శ్రీమతి వాణిరామారావు, రాష్ట్ర సంక్షేమ సలహా సంఘఅధ్యక్షురాలు శ్రీమతి శ్యామలాదేవి, ఆంధ్రయువతీ మండలి కార్యదర్శిని శ్రీమతి జయప్రదాదేవి, కందా భీమశంకరంగారి సతీమణి ఈ ఉత్సవంలో పాల్గొన్నారు. అతిథులు, శిక్షణపొందుతున్న విద్యార్థినులు, అధ్యాపక వర్గం సూత్రయజ్ఞంలో పాల్గొన్నారు.

స్వాతంత్ర్యాదర్శాల సాధనకి ఏపని చేయదలచుకున్నా మనస్ఫూర్తిగా ఆపని చేయవలసిన ఆవశ్యకతను గూర్చి శ్రీమతి టి. లక్ష్మీకాంతమ్మగారు చెప్పారు.

ప్రథమ, ద్వితీయ ప్రణాళికలలో సాధించిన విజయాలను గురించీ, తృతీయ ప్రణాళికలో తలపెట్టిన ముఖ్య

విషయాలను గురించి శ్రీమతి వాణీ రామారావుగారు వివరించారు.

శ్రీమతి రుక్మిణమ్మగారు ప్రఖ్యాత భారత నారీమణుల జీవితగాధలను జ్ఞప్తికితెచ్చి, ఈ సంస్థలో తర్ఫీదు పొందు తూన్న విద్యార్థినులు వారిని ఆదర్శంగా తీసుకొని, వారి అడుగుజాడలలో నడవాలని సలహా ఇచ్చారు.

స్వాతంత్ర్యదిన ప్రాశస్త్యాన్ని గురించి ఆంధ్ర మహిళాసభ కార్యదర్శిని శ్రీమతి సుగుణమణిగారు వివరించి, జాతీయ నిర్మాణానికి, భావితరాలవారి పురోభి వృద్ధికీ, శక్తివంచన లేకుండా కృషి చేయవలసినదిగా ఉద్బోధించారు.

వందన సమర్పణం అయాక 'జనగణమన' జాతీయ గీతాగానంతో నాటి ఉత్సవం సమాప్తమైంది. ★

# ఆదర్శ వివాహం

ఈ నెల 5 వ తేదీని, ప్రేమసమాజాశ్రమ బాలిక చి॥ సౌ॥ ప్రేమ దమయంతికిని, చి॥ యన్. యస్. చలంకు ఆదర్శ వివాహం జరిగింది. వివాహానికయిన ఖర్చులు యిదివరకటిలాగే పూర్ణాప్రొడక్షన్స్ అధిపతి శ్రీ గ్రంధి బ్రహ్మాజి గారు భరించారు. పలువురు స్థానిక ప్రముఖులు, పై గ్రామాల నుండి అనేక సాంఘిక సేవా సంస్థల ప్రతినిధులు వివాహానికి హాజరైనారు. అమెరికన్ అతిథులు కూడా ఉత్సవంలో పాల్గొన్నారు. రాష్ట్ర ముఖ్యమంత్రి, తదితరనాయకులు, పారిశ్రామిక వేత్తలు మున్నగు అనేకులు శుభాకాంక్షలు పంపిచారు. ఇంత వరకు ప్రేమ జమాజాశ్రమంలో పెరిగిన 19గురు బిడ్డలకు వివాహాలయినవి.

# వేడికోలు

అనువాదం : కె. జలజ.

మూలం ; గీతాంజలి

నీదు సభాస్థలిలోన
ఒదిగి ఒకమూల కూర్చుండి
పాటలు పాడనిమ్ము.

ఈ సంకుచిత లోకంబులోన
తెలియ దేమియు నాకు కొంచెమైన
నిరర్థకంబైన నాజీవతంత్రులను
మాటిమాటికి నే మీటుచుంటి
ప్రగాఢ తమస్సులోన

మనసులో నీ మూర్తిదలచి
పూజచేసెడి వేళలో
నీముందు నిలుచుండి
పాట యొక్కటి పాడనిమ్ము

ప్రభాత మారుతంబులోని పసిడి,
వీణియకు శ్రుతులు సవరించి
భవద్దివ్య సముఖమునకు 'రారమ్మని'
నాకు ఆనతిమ్ము.

---

# మనుష్యులూ - స్వభావాలూ

## శ్రీమతి పవని నిర్మలప్రభావతి

ఆవిడ ప్రవర్తన చూస్తుంటే మొదట నేను చాలామరభిప్రాయపడ్డాను, ఓ మాటకూడ మాట్లాడదు. మనం అడిగిన దానికి సమాధానం చెబుతుందా అంటే, అదీ అః లు, ఊః—ల తోనే. బలవంతాన ఎల్లాగో ఒకటి రెండు మాటలు మహా తడబడి మాట్లాడింది చివరకు. వచ్చేటప్పుడు తోవపొడుగూనా నా పక్కన వచ్చిన వాళ్ళిద్దరూ అవిడ మహాగర్విష్టిలా వుందంటూ తెగ విమర్శించటం మొదలెట్టారు కానీ, నాకెందుకో ఆలా అనిపించలేదు తశ్వాత బాగా పరిచయం అయినతర్వాత తెలిసింది ఆవిడదోరకమైన సంకోచ స్వభావం. స్వతహాగా చాలా మెతక మనస్సు. ఎలా మాట్లాడ్తే ఎవరేమనుకుంటారోనని సంకోచమట. ఆదీగాక తనకు సరిగా నలుగురితో మాట్లాడట్నం చేతరాదని, వాళ్ళ శ్రీవారూ, తదితరులూ సర్టిఫికేటు ఇచ్చారుట. దాంతో రానురాను ఆ సంకోచం ఎంత అయిపోయిందంటే, ఆవిడ నిజంగానే ఎవ్వరితోను సరిగ్గా మాట్లాడలేని పరిస్థితికి దిగనారిపోయింది! నలుగురెవరేనా వస్తే తాను ఎలా నిలబడాలి? కూచోవాలి? ప్రవర్తించాలి? అనేవికూడా సమస్యలుగా రూపొంది, తడబడిపోవటం మొదలెట్టింది.

పై రకం సంకోచ స్వభావులు, మగాళ్ళలోనూ, ఆడవాళ్ళలోనూ చాలామంది వున్నారు. ముందుచూడగానే గర్విష్టులుగానో, అహంకారులగానో చిత్రించుక అపోహపడ్తాం. కానీ తీరా నిజం తెలుసుకుంటే జాలివేస్తుంది. ఈ స్వభావాన్నే ఇంగ్లీషులో "ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్ (క్షమించండి! సరైన తెలుగు తర్జుమా ఏమిటో నాకు తెలీటంలేదు) అంటారు. కొందరికిది స్వతహాగా పుట్టుకతో వుంటుంది. మరికొందరికి చుట్టుపట్ల మనుషులవల్ల ఏర్పడుతుంది. నామట్టుకు నాకు ఈ సంకోచ స్వభావమనేది ఓ మానసిక బలహీనతఅనిపిస్తుంది. ఈబలహీనతవల్ల అన్నీ తెలిసి వుండికూడా, తమకేమీ తెలీదనే అపోహపడ్తుంటారు. మరీ నలుగురిని చూచారంటే చాలు. తడబడి బెదిరి పోవటమే కాకుండా ఎంతోఇరుగ్గా, తాము చాలా అసమర్థుల మన్నట్లుగా బాధపడి పోతుంటారు.

మామూలుగా ఎంతో మనోధైర్యం, ఆత్మవిశ్వాసం, ఉండేవాళ్ళయినా, పక్కనవాళ్ళు ఊరికే ప్రతిచిన్న విషయంలో కలుగజేసుక 'అలాకాదు, ఇలాకాదు,' అంటూనో చేతరాదనో, పనికిమాలిన వాళ్ళనో విమర్శిస్తూవుంటే, ఒకప్పుడు కాకుంటే మరొకప్పుడేనా నిస్పృహతో ఒక్కసారిగా దిగజారిపోతారు? అందాకవున్న స్వంత ఊహలు చెదరిపోతాయి! అలాటిది ఇక స్వభావసిద్ధంగా సున్నితమైన మనస్సు కలవాళ్ళయితే, ఇక వాళ్ళు తయారయ్యేది నిజంగా అసమర్థులు గానే! ఎంతో అద్భుతమైన ఆలోచనాశక్తీ అవీ వుండికూడా వాళ్ళు రానురాను ఎందుకూ పనికిరానివాళ్ళుగా, చేతగానివాళ్ళుగా అయిపోతారు! ముందు నేను పరిచయం చేసిన ఆవిడ చూడండి; స్కూల్లో చదువుకునే రోజులలో ఉపన్యాసలివ్వటంలో ఫస్టుప్రైజులు సంపాదించుకున్న మనిషి, సభాపిరికితన మంటే ఏమిటో ఎరుగని ఆవిడ, మామూలుగా మాతో మాట్లాడటానికి అంతగాభరాపడి పోయిందంటే, ఆవిడ చుట్టుపక్కల (భర్త, అత్తగారు, ఆడబిడ్డలు వగైరా) వాళ్ళ విమర్శలతో ఎంతమానసిక ధైర్యాన్ని కోల్పోయిందో చూడండి అదిచాలక వచ్చిన అల్లికలూ. చేతి పనులూ కూడా చెయ్యటానికి భయమే!

మరికొందరికి ముఖ్యంగా చిన్నపిల్లలుగా వున్నప్పుడే పెద్దవాళ్ళ "కస్టడీ"లో ఈ సంకోచ స్వభావం ఏర్పడిపోతుంది. ఆ మధ్య ఒకసారి ట్రైన్‌లో వస్తుండగా, ఒకావిడా, ఆవిడకొడుకూ (షుమారు పది పన్నెండేళ్ళుంటాయి) కూడా వస్తున్నారు. ఇక చూడండి, ట్రైన్ ఎక్కింది మొదలు ఆవిడ ఆ పిల్లాణ్ణి సర్దుతూనేవుంది. 'ఇదో అలా కిటికిలోంచి చూడకు! అని ఓసారి' ఆకాళ్ళు అలాముడవద్దు 'చెయ్యెందుకలా తిప్పుతావ్?' ఇదేవరస. ఆ పిల్లాడు ఇక ఏంచేస్తాడు? ఎటుచూస్తాడు? నా కెంతో జాలేసింది. ఇక ఆ విధంగా పెరిగిన పిల్లలు (ఆడ, మగ, ఎవరేనా కానీండి) నిజంగానే పనికిమాలినవాళ్లుగా తయారైనాకంటే కారూ మరి? క్లాస్తయినా సొంతంగా ఆలోచించుకోటానికి అవకాశమేదీ వాళ్ళకు? స్వేచ్ఛగా ప్రవర్తించటానికి వీలుంటేగదా? ప్రతిదానికీ చిన్నప్పట్నుంచే సంకోచించటంతో, అ సంకుచిత స్వభావం వేళ్ళు తన్నుక మహా వృక్షమై పోతుంది, పెరిగి పెద్దయ్యేసరికి! ఆత్మవిశ్వాస మంటూ ఏమీ మిగలదు. సహజంగా పసిపిల్లలకు

కొంత చంచల స్వభావంవుంటుంది. అప్పుడేవాళ్ళు అన్ని విషయాలను గురించి తెలుసుకోవాలనీ. చూడాలని ఉబలాట పడ్తుంటారు అలాంటి సమయంలో చాలా కరెక్టుగా పెంచాలనే అపోహతో, ఊరికే ప్రతిఊహనూ, కదలికనూ, మహా నిశితంగా కరెక్టు చెయ్యబోతారు, కొందరు పెద్దవాళ్ళు. దాంతో (మరీ గండాగొండివాళ్ళు ఒకరిద్దరు తప్ప) వాళ్ళకు స్వభావ సిద్ధమైన ఊహపాడై పోతుంది. ప్రతి ఒక్కరిని చూచి బెదరిపోవటమో, తామేమీ చెయ్యలేమనే దురభిప్రాయమో బలపడి పోతుంది. ఒక్కముక్కలో చెప్పాలంటే సభాపిరుకులుగా తయారౌతారు!

ఇంకోరకం వాళ్ళున్నారు. పెంపకంలోనూ ఆ సంకోచ స్వభావంరాదు. ఇతరులంతా వాళ్ళనేమీ అనరు! అయినప్పటికీ తమలోతామే బాధపడి పోతుంటారు అర్థంలేకుండా! మా పిన్నికూతురు ఈ కోవకు చెందిందే! దానికన్నీ సంకోచాలే! తాను అందంగా వుండలేదేమోనని అనుమానం! బాగా పాడలేదేమోనని అనుమానం! మాట్లాడటం చేతరాదేమోనని సందేహం! ఇలా ప్రతిదీ సంకోచమే! ఒక్కడుగు ముందుకు వెయ్యలేదు, వెనక్కు రాలేదు! ఇదిమాత్రం నిజంగా మానసిక వ్యాధుల్లో ముక్యమైనదేమోననిపిస్తుందినాకు! దేవుడిచ్చిన ఆకారాన్నీ, కంఠస్వరాన్నీ ఎవరు మార్చగలరు? పైగా ప్రతి ఒక్కరికీ తనను గురించి అనుకోటమేనా పని? మాట్లాడినా, నవ్వినా, నడిచినా ప్రతికదలికలోనూ అందరూ తననే నిశితంగా చూస్తున్నారేమోననే సంకోచానికి ఇక ఎవరేం చెప్పగలుగుతారు చెప్పండి?

ఇక సంకోచ స్వభావుల ఊసు వదిలేద్దాం!

రెండోతెగ వాళ్ళున్నారు! వీళ్ళకు మొదట చెప్పిన వాళ్ళకెంత ఆత్మ సంకోచమో అంత ఆత్మ విశ్వాసం! దాంతో ఎదుటివాళ్ళ ప్రాణాలు తోడేస్తారు!

ఆ మధ్య మాకు తెలిసిన ఒకాయన వచ్చారు! ఉన్నదేమో అరగంటేనయినా, ఆరుగంటలు కాలక్షేపం అయినట్లుగా వుంది మాకు. బొంబాయిలోని ప్రతి జీవరాసి తనమీదే ఆధారపడి వున్నదనీ, యంత్రాలతోసహా తన వల్లే పనిచెయ్య గలుగుతున్నాయనీ చెబుతూ తానంత గొప్పవానిగా నిరూపించుకోటానికిగానూ, ఆయన ప్రవర్తనా, చెప్పే ఉదాహరణలూ చూస్తూ, వింటూవుంటే నవ్వేకాకుండా జాలికూడా వేసింది. కోతలేకానీండి, భవిష్యత్తులో తానుచెయ్యాలని కలలుగనే వూహలే కానీండి. ఏదైతేనేం జంకూ గొంకూ లేకుండా అనర్గళంగా "ఆత్మ విశ్వాసం" అంటూ చెప్పుకున్నాడంటే నాకెంతో ఆశ్చర్యం వేసింది. దీనినే ఇంగ్లీషులో "సుపీరియారిటీ కాంప్లెక్స్" అంటాడు! ఏమిటో వాళ్ళంతా ప్రత్యేకమైన మనుషులనీ, ప్రపంచంలో ఏ ఒక్కటీసాటిరాదనీ. అన్నీ కరపలామలకమనీ, ఇలాటి కొన్ని అపోహలతో నిండివుంటారు! ఆదేమంటే మాకు "ఆత్మ విశ్వాసం" ఎక్కువ అంటూ కబుర్లు చెబుతుంటారు! ఆ కబుర్లు వినగా వినగా అసహ్యం వేస్తుంది. ఏముంది అందులో? ఆత్మస్తుతి—పరనింద! తాము చాలా గొప్పవాళ్ళమని నిరూపించుకోటానికి పడే పాట్లూను! అంతే!

మా బాబాయి రకం మనుషులు మరికొందరు పైరకం వాళ్ళలోనే తమ గొప్పతనమే కాకుండా "మేమూ మా వంశమూ" అంటూ ఎదుటివాళ్ళు ఉత్త అప్రాచ్యులంటూ వాగేస్తుంటారు బాబాయిలా! అన్తమానూ చెప్పుకోవాల్సినంత ప్రత్యేకత నిజానికేమీవుండదు! ఒకవేళ అలాటిదే దయినా వుంటే దానంతటదే కన్పిస్తుంది కదా! ప్రతి మనిషితో "నేనిలాచేశాను, అలాచేశాను, ఫలానివాళ్ళట్టి పనికి మాలినవాళ్లు అహంకారంతో నిండిపోయి తెగ మాటాడ్తుంటాడు బాబాయి" ఇలాటి వాళ్ళనుచూస్తే, గౌరవించ బుద్ధిపుట్టదు సరికదా! ఒ విధమైన ఏహ్యభావం, కూడా ఏర్పడుతుంది. దానిని "ఆత్మవికాస"మనీ "ఆత్మ విశ్వాస"మనీ సమర్థించటానికి ఆస్కారం వుండదు. అదో రకమైన అహంకారపూరిత మానసిక వ్యాధేమోనని పిస్తుంది నా మట్టుకు నాకు. కాదు అంటే తమలోని ఏదో బలహీనతను కప్పిపుచ్చుకోటానికిగ్గానూ వృథాగా వాగే, వాచాలత్వం అయినా కావాలి!

ఇంతకూ చెప్పొచ్చేదేమిటంటే "ఆత్మ సంకోచం" (ఇన్ ఫీరియారిటీ కాంప్లెక్సు) అనేది ఆత్మ వికాశానికి ఎంత నిరోధకమో, అహంకారంతో కూడిన ఆత్మవిశ్వాసం తాము చాలా గొప్పవాళ్ళం లేక తెలివిగలవాళ్ళం (సుపీరియారిటీ కాంప్లెక్సు) అనే అపోహ. పడటంకూడా అంతనిరోధకమే! ఈ విషయంలో (ముక్యంగా మొదటి వాళ్ళ విషయంలో) పెద్దవాళ్ళుగా వుండేవాళ్ళు దగ్గరున్న చిన్నవాళ్ళని, అందులోనూ లొంగివుండే సున్నితమైన మనస్సువాళ్ళని, ఊరికే ప్రతి చిన్న విషయంలో ఎగతాళి చెయ్యటమో, విమర్శించటమో చాలా అనుచితమైనపని. కేవలం వాళ్ళలోని లోపాల్ని, బలహీనతల్నీ భూతద్దం కిందపెట్టి చూపెట్టడంతో, రాను రాను ఎంత మనోధైర్యం గలవాళ్ళయినా ఉట్టి వాజమ్మలుగా తయారౌతారు, అందరూ వక్తలుగారు! అందరిల్లోనూ అరవైనాలుగు కళలూ నిబిడీకృతమై వుండవు, అలాట

ప్పుడు కొందరిలో కొన్ని బలహీనతలు సహజంగా వుంటాయి, చేతనైతే సున్నితంగా అవిపోవటానికి మార్గంచెప్పి, ప్రోత్సాహమివ్వాలి: లేదా ఆపని చేతరా కుంటే పలక్కుండా వూరుకోవచ్చు, అంతేగానీ, పది మాట్లు విమర్శించిన దానివల్ల ఆదాయమేమిటీ అంటే వాళ్ళలో ఉన్నతెలివికూడా పోగొట్టడమే నన్నమాట. చిన్నపిల్లల విషయంలో కూడా అంతే. కొన్ని మంచి పనులకోసం కొంత సర్దిచెప్పినా ఆదేపనిగా ప్రతి చిన్న కదలికలోనూ వాళ్ళమీద నిఘావెయ్యటం అంతసబబు కాదు. ఇక మా పిన్నికూతురులాటి వాళ్ళకు నే నిచ్చే సలహా ఒక్కటే భగవంతుడిచ్చిన రూపురేకల్నీ, కం రాన్నీ మనం మార్చలేం, అనుక్షణం ఎవరేమను కుంటా రో, అంటారో. మనం ఎలావున్నామో, ఏమిటో ననే సంకోచం మాత్రం పనికిరాదు, మనకు చేతనయినట్లు ప్రవర్తిస్తాం, దానికి ఒకరనుకునే దేమిటి? (ఇలా అని బరి తెగించి అనికాదు సుమండీ నా ఉద్దేశ్యం!) ఇక నిత్య జీవితంలో ఇలా సంకోచపడటం మొదలెడితే ఎన్నిటికని పడగలం? కాబట్టి ఆ సందేహాలే మనసులోకి రానివ్వ కూడదు.

ఇక రెండోతెగ (సుపీరియారిటీఫీలయ్యేరకాలు) వాళ్ళు తాముకూడా ఓ విధమైన మానసిక వ్యాధికి లోనయ్యారని గ్రహించుకోవాలి. పోనీ ప్రత్యేకత అందరికంటే వుం దనే అనుకుందాం, అంత మాత్రాన స్వంతడబ్బా వాయిం చుకోటం అర్ధంలేని పని, సృష్టి, స్థితి, లయాలకు కారణ భూతులం మనమేనంటూ అపోహ పడటంకూడా వెర్రి తనమే! ఆత్మ వికాసానికీ, ఆత్మ విశ్వాసం అవసరమే కానీ, అదీ మరీ ఎక్కువ పాళ్ళలోవుంటే హాస్యాస్పదం గానే వుంటుంది, మనం అసమర్ధులమనే సంకోచ స్వభా వమూ, ప్రత్యేకమయినవాళ్ళమనే అపోహా రెండూకూడా మనిషిని ఉన్నతి మార్గంనుంచి కిందికి లాగుతాయి. అం దుకే మనలో ఆ రెండింటిలో ఏ ఒక్కటీ ఎక్కువగా విజృంభించకుండా చూచుకోవాలి, మనమేమీ పనికిమాలిన వాళ్ళంకాదు అనే స్థిర అభిప్రాయంతో బాటు, లోకంలో అందరికంటేమనమే గొప్పవాళ్ళమూ కాదు (లేక తెలివి గలవాళ్ళమూకాదు) అనే భావన మనస్సులో ఇముడ్చుక ప్రవర్తిస్తే ఏ చిక్కూ వుండదు, అది నిజంగా ఆత్మవికా సానికి పునాది అవుతుంది. కాదంటారా?

# ఏర్చికూర్చిన ముత్యాలు

## I

దుర్గాబాయమ్మగారంటే ఒకవ్యక్తి కాదు; ఒక వ్యవస్థ. అనిబిసెంటమ్మను పోలిన వ్యక్తి. దివ్యజ్ఞానసమాజానికి అనిబిసెంటమ్మ మూలవిరాట్టయినట్లు ఆంధ్ర మహిళా సభకు దుర్గాబాయమ్మగారు మూలవిరాట్టు. సంస్థా నిర్మాణ నిర్వహణ శక్తులకు అనిబిసెంటమ్మ జగత్ప్రసిద్ధిని సంపాదించింది: జగత్ప్రసిద్ధి కాకపోయినా, దేశ విఖ్యాతి సంపాదించింది దుర్గాబాయమ్మగారు.

కనకదుర్గమ్మవలె ఈ కాకినాడ దుర్గమ్మ శక్తిమయి. అయితే ఆమెశక్తి దాకితెన్నూలేక పొంగి పొరలి ప్రవహించే శక్తి కాదు: వ్యూహవిధానంలో నడిచేశక్తి; సంకల్పసిద్ధిని పొందేశక్తి.

మొట్టమొదటగా దేశం దుర్గాబాయమ్మగారిని గురించి విన్నది ఉప్పుసత్యాగ్రహసమరంలో. ఏదో పనిమీద వచ్చి అప్పటికి ఆమె మద్రాసులో ఉండటం తటస్థించింది; సత్యాగ్రహం రాబోతున్నదని, అందులో పాల్గొందామనీ రాలేదు. కాని, జలయేరు పొంగినట్లు 'ఎదలో దేశభక్తి పొంగి ఆమెను సత్యాగ్రహ రంగంలోకి తరుముకొని పోయినది. నాగేశ్వరరావు, ప్రకాశం పంతులుగార్ల తర్వాత ఉద్యమ నాయకత్వం వహించింది. అప్పుడు కనుక ఆమెలేకపోతే, మద్రాసునగరంలో ఉద్యమం సన్నగిలి పోయేది. ఎవరీ దుర్గాబాయి- అన్న ప్రశ్నతో మద్రాసు నగరం మారుమ్రోగింది.

అప్పటి కామెకు పట్టుమని ఇరవయిఏళ్ళు కూడా లేవు. అందుకనే అవిడను "జోన్ ఆఫ్ ఆర్క్" వంటి వీరవనిత అని ప్రస్తుతించారు. మనిషీ, మాటాకూడా బెర్నార్డ్‌షా వర్ణించిన జోన్ రూపాన్నే స్ఫురింపజేసేది.

పిల్లప్రాయమందే ఆమెలో ఒకశక్తి తలయెత్తి వేధించుకు తినేది. పెద్దలకు అందని, పెద్దలు తలపెట్టని పనులకు పూను కొనేది. కాకపోతే పదిఏళ్ళు వచ్చేటప్పటికే, హిందీ భాషలో మంచిపాండిత్యం సంపాదించడమే కాక, అమ్మలకీ, అమ్మమ్మలకీ బడిపెట్టి పాఠాలు చెప్పడమేమిటి?

వాస్తవానికి ఆంధ్రలో మొదటి హిందీ పాఠశాల పెట్టిన పేరూ ప్రతిష్ఠా ఆమెవనే చెప్పాలి. జమ్నాలాల్ బజాజ్ ఆ పాఠశాలను చూచి "దాన్ని నడిపేదెవరు?" అని ప్రశ్నించారట. "ఇదిగో ఈ అమ్మాయి!" అని పరికిణీ చొక్కాలో ఉన్న దుర్గాంబని చూపించారట.

ప్రథమ సత్యాగ్రహం నాటికి దుర్గాబాయమ్మగారికి దాదాపు ఇంగ్లీషురాదంటె ఆశ్చర్యపడవచ్చు. ఉప్పుసత్యాగ్రహంలో రెండు పర్యాయాలు జైలుకు వెళ్ళింది. మూడు నెలలు మధుర జైలులో ఒంటరిగదిలో వేశారు. నడి ఎండలో నిలబెట్టారు. మెరపకాయలు దంపించాగా



విడుదలయ్యేనాటికి ఆరోగ్యం పూర్తిగా చితికిపోయింది. అయినా ఆమె తనమనోనిశ్చయంవల్ల అనారోగ్యాన్ని జయించి విద్యాభ్యాసం ఆరంభించింది. మహర్షి సాంబమూర్తి పితృవాత్సల్యంతో ప్రోత్సాహమిచ్చారు. మెట్రిక్యులేషన్ నుండి ఎం. ఏ. బి. యల్. వరకు పరీక్షలన్నీ ఉత్తమశ్రేణిలో ఉత్తీర్ణురాలయింది. రాజ్యాంగ నిర్మాణసభ సభ్యురాలైంది. అప్పటికే ఒక వ్యక్తిగానే కాక ఒక వ్యవస్థగా పల్లవించడం ఆరంభమైంది.

ఆమె ఆ రోజులలో స్థాపించిన ఆంధ్ర మహిళాసభ వివిధశాఖలతో వ్యాపించి మహా వటవృక్షంలా వర్ధిల్లుతున్నది. ఆ సంస్థ ఆమె కార్యదీక్షకు, నిర్మాణశక్తికి ఓర్పుకు చిహ్నం. మద్రాసుమాదని ఆవేశంతో వీరాంగం వేసిన నాయకులెవరూ మద్రాసులో ఆంధ్రసంస్థను స్థాపించలేక పోయారు; స్థాపించిన ఘనత దుర్గాబాయమ్మగారికి దక్కింది.

1952 లో పార్లమెంటుకు జరిగిన ఎన్నికలలో ఆమె ఓడిపోక పోయిఉంటే, చాలా మందికిమల్లె మహాఅయితే ఒక మంత్రి అయ్యేది, అంతే. ఓడిపోవటం ఆమె కెలా ఉన్నా దేశానికి మంచిదయినది. గెలిచిఉంటే సంఘ సంక్షేమ వ్యవస్థకు (సోషల్ వెల్ ఫేర్ బోర్డుకు) అధ్యక్షురాలుగా నేతుశీతన పర్యంతం జనానీకానికి సేవచేయ గలిగేదికాదు. ఆ వ్యవస్థ భారతదేశమంతా పరివ్యాప్తమైంది. ఒక చిన్న సామ్రాజ్యం. ఆమె దానికి మహారాజ్ఞి.

ఆమె ఇంత ఉన్నతస్థానం అక్రమిస్తున్నా, చింతామణి దేశ్‌ముఖ్ ఇల్లాలై దుర్గాబాయి దేశ్‌ముఖ్ అయినా, ఆంధ్రులకు దుర్గాబాయమ్మగారే.

(ఆంధ్ర సచిత్రవారపత్రిక)

## II

ఆంధ్ర మహిళాసభ అనగానే మద్రాసు, మైలాపూరులో ముచ్చట గొల్పుతూ గేటుమీద, బోర్డు మీదకు ప్రాకిన తీగలూ, లోపల మామిడిపిందె ఆకారంతో పెంచిన తోటా, పౌంటెనూ, జ్ఞాపకంవస్తాయి,

అంతకంటె ముందుగా శ్రీమతి దుర్గాబాయిగారు అమ్మమ్మగారూ. మహిళాసభ మూలంగా మద్రాసులో ఆంధ్రత్వము చాటుకొంటూ నిలద్రొక్కుకోగలిగిన ఆంధ్రులూ కళ్ళముందు కనిపిస్తారు.

తరువాత నర్సింగుహోమూ, ప్రెస్సూ, శిశు విహారూ...ఒక్కొక్కటే మనస్సులో మెదులుతాయి.

హైదరాబాదు శాఖ మద్రాసు సభకు చిట్టి పాపాయి. ఉదయించి మూడేళ్ళుకూడా కాలేదు. మద్రాసులో శ్రీమతి దుర్గాబాయిగారి నాయకత్వం క్రింద శిక్షణపొంది ఆరితేరిన సభ్యురాండ్రే హైదరాబాదు శాఖా సారథులైనారు. శ్రీమతి ఎ. సి. కృష్ణారావు. కె. పాపాయమ్మ. ఎ. శ్యామలాదేవి. లీలా గౌరిబాజీ. కే. సుగుణమణిగార్లు. చివరివారిద్దరూ కార్యదర్శినులు.

పుట్టిననాటినుండి అనుక్షణం తీరికలేని పాపాయిగా పెరిగింది హైదరాబాదు శాఖ. ప్రాంతీయచేతి పరిశ్రమల శిక్షణ కేంద్రంగా ప్రారంభించింది. దక్షిణాది రాష్ట్రాలనుండి వచ్చిన స్త్రీలకు కార్డుబోర్డు, బైండింగుపని పేము, వెదురుపని, తోలుపని, బొమ్మలు చేయడం, బట్టలు అద్దకం మొదలైన వానిలో ఉచితంగా శిక్షణ ఇవ్వబడుతోంది. ఈ మూడేళ్ళనుండీ, సంవత్సరానికి 50 మంది శిక్షణ పొందుతున్నారు. ఈ కేంద్రంపైన ఖర్చులింకా అఖిలభారత చేతి పరిశ్రమల సమితి భరించుతుంది. (హైదరాబాదు ఆంధ్రమహిళ)

# కథా- కథానిక- స్వరూపం- స్వభావాలు

## శ్రీ ఏ. ఎస్. రామారావు.

ఈ నాడు మనం విభిన్న భాషలలో వెలువడే వివిధ పత్రికల్లో ఎన్నెన్నో కథానికలు చూస్తున్నాం. ఎందరో వుత్సాహవంతులు కథానికలు వ్రాయాలని ప్రయత్నిస్తున్నారు. కొందరు సఫలులు, మరికొందరు విఫలులు అవుతున్నారు. ఈ విధంగా ఎందుకు జరుగుతోంది? వివిధ పత్రికల్లో ప్రచురిత మవుతూన్న కథానికలన్నీ - కథానికా స్వరూప, స్వభావాల్ని కలిగి వున్నాయా? ఇవి ఇప్పుడు మనం తెల్సుకోవల్సిన విషయాలు.

### కథానిక పుట్టుక—విస్తరణ

'కథానిక అధునిక సాహిత్య ప్రక్రియలలో ప్రముఖ స్థానాన్ని పొందివున్నది. ఇది పాశ్చాత్యుల సాంప్రదాయం. ఈ విధానంలో రచన చేయడం తొల్దొలుత-గా అమెరికాలో ప్రారంభించ బడిందని ప్రాజ్ఞుల అభిప్రాయం. ఈ విధమైన రచనలు 19 వ శతాబ్దంలో అమెరికాలో హెచ్చుగా అభివృద్ధిని గాంచేయి. 1833 నుండి ఎడ్గార్ ఎలెన్‌పో; 1840 నుండి హాల్ హార్న్; 1871న బ్రెట్‌హార్టేలు; 1871న బండీ హెన్రీ జేమ్స్ మొనలగువారు ఎక్కువగా కృషిచేసారు, ఈ పద్ధతి ఇంగ్లాండుకు కూడా ప్రాకటంతో, 1877 నుంచి స్టీవెన్సు: 1890 నుంచి కిప్లింగ్‌ల చేత బాగా ప్రచారంలోనికి తీసుకురాబడింది. అంతటితో ఈ రకమైన రచనలు ఫ్రాన్సు, రష్యా దేశాలకు ప్రాకి యూరప్ సాహిత్య ప్రపంచంలో ప్రాముఖ్యతను పొందింది. పాశ్చాత్యుల ఏలుబడిలోనున్న వలస దేశాలన్నిటిపైన ఈ సాహిత్యప్రక్రియ ప్రభావం పడి విశేషంగా పని చేసింది. ముఖ్యంగా బ్రిటీష్ పరిపాలకులపాలనలో బడిన భారతీయ భాషా సాహిత్యాలన్నింటిపైన ఈ ప్రభావం ఒత్తిడి తగిలి- మొత్తంమీద భారతీయ భాషాసాహిత్యాలలో గణనీయమైన విప్లవాన్ని తీసుకువచ్చిందనే చెప్పవచ్చు.

ఆనాటికి భారతీ భాషాసాహిత్యాల్లో- ముఖ్యంగా తెలుగు సాహిత్యంలో కథానికలు లేవా? అన్న ప్రశ్న వుదయించవచ్చును. ప్రాచీనాంధ్ర సాహిత్యంలో కథ లున్నవో, లేవో స్పష్టంగా తెలియదు. కాని నాటి కథలు గ్రంథస్థం కాకపోయినా, వాగ్రూపంలో వుండి వుండొచ్చు. అనంతరాంధ్ర సాహిత్యంలో కథలు కావ్యలోపాల్లోనో; ద్విపదలలోనో లభ్యమవుతున్నాయి. కేవలం వచన రచనలో కథలున్నట్లు తోచదు. పంచతంత్ర కథలు, భేతాళ కథలు, హంస వింశతి కథలు- మొదలు, గాగల కథా కావ్యాలు అనంతరం సృష్టించబడినా- అవి నీతి బోధకమైన జానపద కథా కావ్యాలు మాత్రమే వుండటం కాక- కథానికా స్వరూప స్వభావాలను పొంది వుండలేదని పెద్దల అభిప్రాయం. ఆనాటి మరే ఇతర భారతీయ భాషా సాహిత్యంలోనూ 'కథానిక'లున్నట్లు తెలియరావడంలేదు. అందుచేత 'కథానిక' పాశ్చాత్య సాంప్రదాయమేనని ఒప్పుకోవచ్చును.

### కథానిక అంటే ఏమిటి?

కథానికను అతి చిన్న కథగా చెప్పవచ్చును. క యొక్క రూపాంతరమే కథానిక. కథాశబ్దాన్ని వ ప్రాచీనాలంకారికులు ఈ విధంగా వివరించారు. అఖ యిక (A connected Story); (ATale;) అఖ్యానకః (An Episode or a Short legend; ) ఖండకథ, కథ కములేక కథానిక.

కథలను కేవలం గద్యంలో కాని, పద్యంలోకాని లేక రెంటి సమ్మిశ్రితములో వ్రాయవచ్చును. కథయొక్క రూపాంతరాలన్నీ ఇటు గద్యంలో కాని, అటు పద్యంల కాని మనకు లభిస్తాయి. కాని కథానిక అలాకాదు. క నిక కేవలం వచన రచనలోనే కానవస్తుంది.

అందుచేత కథానిక యొక్క మూలమైన కథ అం ఏమిటో తెల్సుకోవలసిన అవసరం ఎంతైనావుంది. అం కథంటే ఏమిటో నిర్వచించవలసి వున్నదన్నమాట.

చలంగారు అన్నట్లు కథకుగాని, మరేదానికి గాని ని చనం లేనేలేదు. ప్రకృతిని నిర్వచించడం ఎంత కష్ట కథను నిర్వచించడం కూడా అంతే. కాని, [redacted], మనశ లంకార శాస్త్రంలో కథంటే, కొంతవాస్తవికతను క కల్పితమైన ఇతివృత్తమేనని చెప్పబడింది.

ప్రముఖ పాశ్చాత్య కథారచయిత ఎడ్గార్ ఎలెన్ కథను గురించి చెప్పిన మాటలు కూడా మనం అన్వయి జేసుకోవచ్చును. "నిపుణుడైన సాహిత్యకారుడు మనసు మెదిలిన ఊహలను తన కలంద్వారా చిత్రిస్తాడు. అ మరికొంత తెలివైన వాడయితే, తన ముందర జరుగుతు సంఘటనల కనుకూలంగా తన ఊహల్ని సర్దుకోడు. ఊహల కనుగుణంగా సంఘటనలను సృష్టిస్తాడు. అ యొక్క ఆకృషి ఫలితంగానే కథ రూపొందుతుం అంటాడు.

"కథంటే కథనరూపంలో చెప్పబడే చిన్ననాటక అంటున్నాడు. మరొక ప్రముఖ పాశ్చాత్య కథారచయి హెన్రీథామస్,

అందుచేత కను ఏఏ విధాలుగా మనం నిర్వచిస్తా ఆయా నిర్వచనాలన్నీ కథయొక్క రూపాంతరమైన క కథానికలకు కూడా వర్తిస్తాయని వేరే చెప్పనక్కర్లేదు

అయితే, కథానిక ప్రత్యేకమైన లక్షణాన్ని కలిగివున్న కథా లక్షణాలన్నీ సంపూర్ణంగా కలిగి వచనంలో రచి బడిన చిన్న "చిన్నకథే" కథానిక.

కథానిక లక్షణాన్ని వివరిస్తూ శ్రీ బొందలపాటివా "కథానిక ఏదైనా ఒక గొప్ప సంఘటన యొక్క సంక్షి

వర్ణనాత్మక భాషా చిత్రం” అన్నారు. పాఠకునికాలాన్ని వృథా చెయ్యకుండా, అతితక్కువ కాలంలో విజ్ఞానంతో పాటు వినోదాన్ని కల్గిస్తూ, ప్రకృతి రహస్యాలను, మానవుల విచిత్ర చిత్తప్రవృత్తులను, ప్రమాణాల పరిణామాలను సూటిగా చెబుతూ, ఆశ్చర్యాన్ని కలిగించగలిగేదే కథానిక మానవునిలో విప్లవజ్వాలలను రేకెత్తించగల సామర్థ్యం కథానికకు వున్నది. మానవాళిని అభ్యుదయ పథంవై పురుపురోగమింప జేయగలదు కథానిక మానవుని నైతిక పతనానికి కథానిక త్రోవచూపగలదు కూడా!

## తెలుగు సాహిత్యంలో కథానిక

ఈ ప్రత్యేక లక్షణాలున్న కథ యొక్క రూపాంతరమైన కథానిక తెలుగు సాహిత్యంలో 1912 వరకూ ఎక్కడా వున్నట్లు తెలియడంలేదు ఆ రోజుల్లో శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారి సంపాదకత్వాన బందరు నుండి వెలువడే “ఆంధ్రభారతి” ద్వారా ఈ సరిక్రొత్త విధానాని కనుగుణ్యంగా కథ అవతరించిం దనవచ్చును సుమారుగా ఆ రోజుల్లోనే శ్రీ చింతా భీమశంకరంగారు కూడా ఈ పద్ధతిలో రచనలు చేయడంలో చాలా వరకు కృషిచేశారు కాని అవి కానన్ డాయిల్ వ్రాసిన అపరాధ పరిశోధక కథలకు అనుసరణలుగా మాత్రమే నిలిచాయి కాని; సృజనాత్మకమైన రచనలుగా రూపొందలేదు.

తెలుగులో సృజనాత్మకమనే విత్తనాన్ని విత్తి, కథానికా సాహిత్యం అనే మొక్కను అంకురింపజేసింది ఆధునికాంధ్ర కవిత్రయంలో ఒకరైన మహాకవి గురుజాడ గురుజాడ మొలిపించిన మొక్కకు నీరుపోసి పెంచినది గుడిపాటి శ్రీ వెంకట చలంగారు కథానికారచనలో చలంగారు సిద్ధహస్తులని ప్రత్యేకించి వేరే చెప్పనక్కరలేదు, కథానికా సాహిత్యలత దినదిన ప్రవర్ధమానయై విశాలాంధ్రనేకాక, యావద్భారతదేశానికి ప్రాకంపజేసి, కథానికా కుసుమాలను ఇంటింటికీపంచి ఇచ్చినది, శ్రీ యుతులు కొడవటి గంటి; గోపీచంద్. ధనికొండ, బుచ్చిబాబు, మొదలగు ఎందరో రచయితలు, రచయిత్రులూను తెలుగు కథానికా సాహిత్యానికి ప్రపంచకీర్తిని సంపాదించి యిచ్చింది శ్రీ పాలగుమ్మి పద్మరాజుగారు తమ “గాలివాన” ద్వారా

## కథానిక స్వరూపం

కథలకువలెనే కథానికకుకూడా ప్రారంభం; నిర్వహణ, ముగింపు అనే మూడు ముఖ్యనియమాలను పాటించాలి ఇందులో ఏ ఒక్క నియమాన్ని పాటించకపోయినా పాఠకుడు తృప్తినొందడు ఒక రచయిత, అతని రచనలు పాఠకుల హృదయాల్లో శాశ్వతమైన స్థానాన్ని సంపాదించదలుచుకుంటే, పై మూడు నియమాలను తు చ తప్ప కుండా పాటించాలి

అంతేగాక, కావ్యానికి వలెనే కథారూపాలను కూడా శరీరము, ఆత్మ అని రెండుగా విభజించ వచ్చును రచనా విధానాన్ని— అంటే భాష; వాక్య నిర్మాణము; శీర్షిక: పాత్రల పోషణ మొదలైనవి శరీరంగానూ, కథావస్తువును. భావప్రకటనను, రసపోషణను- ఇత్యాది విశేషాల సంయమాన్ని కథాత్మగానూ పరిగణించగాలి పైగా సరళమైన, స్వాదుమనోజ్ఞమైన శైలి,కథకు లావణ్యాన్ని చేకూరుస్తుంది. ఈ నియమాలను దృష్టిలో వుంచుకుని చేసిన రచన పాఠకునికి విజ్ఞానంతోపాటు ఆహ్లాదాన్ని కూడా కలిగిస్తుంది.

## రచనా విధానం

రచన చేయాలనుకున్నప్పుడు ముందుగానే భావాన్ని నిర్దిష్టం చేసుకోవాలి అంతేగాని, కలం పట్టుకుని భావాలకోసం వెతుక్కోకూడదు ముందుగా మనకు కలిగిన భావాలను ఆధారం చేసుకొని ఇతివృత్తాన్ని/రూపొందించుకోవాలి అదే కథావస్తువు ఇతివృత్తాన్ని బట్టి శీర్షిక నిర్ణయం, పాత్రల నిర్ణయం జరగాలి కథలోని వాతావరణం; సంఘటనలు, పాత్రల స్వభావాలు వాస్తవంగా వుండాలి కథ కల్పితమే అయినా, చిత్రణ వాస్తవానికి దూరం కాకూడదు

కథావస్తువు సాధారణంగా మూడు విధాలుగా వుంటుంది (1) ప్రణయజీవిత సంబంధమైనవి; (2) సామాజిక విలువల్ని, మనుషుల విచిత్ర చిత్తప్రవృత్తుల్ని వివరించేవి, (3) ఇతరాలు ఈ మూడురకాల కథావస్తువులను తీసుకొనడంలో రచయిత మూడు విధాలుగా ప్రవర్తించడం సాధారణంగా సంభవిస్తుంది (1) ప్రత్యక్షంలో జరిగినవి; (2) పరోక్షంలో జరిగినవి; (3) తనకు తాను ఊహించుకున్నవీను.

కథ సుఖాంతమైనా, దుఃఖాంతమైనా; రెంటి సమ్మిశ్రమైనా; లేక హాస్యప్రధానమో, వ్యంగ్యప్రధానమో అయినా- కథావస్తువు నిత్యజీవితాన్నుండి తీసుకోబడినదై అందలి సంఘటనలు; పాత్రలు ప్రపంచానికి ప్రతిబింబాలై నిలిచినప్పుడు- అది తప్పక చదవాలనే ఆసక్తి పాఠకునికి కలుగజేస్తుంది

కథనాన్ని చాలా రకాలుగా నడిపించవచ్చు కథ చదువుతున్నంత సేపు సంఘటనలు మనకళ్లముందర జరుగుతున్నట్లు అనుభవాన్ని కల్గించే తీరులో రచయిత చేయడం. ఈ పద్ధతిలో చేసిన రచనలు పాఠకుని బాగా ఆకర్షిస్తాయి. రచయిత తానే కథానాయకుడుగా రూపొంది. కథను రచయితే చెప్పువిధం కేవలం లేఖల రూపంలోనో దిన చర్యలను కథలా అల్లడం ద్వారానో కథారచన సాగించవచ్చును లేదా ఏ ఒక వ్యక్తి యొక్క లేక పాత్ర యొక్క ఒక్కొక్క కోణంనుంచి పరిశీలించి కథనాన్ని రూపొందించడం మరొకతీరు ఏ ఒక్క రీతిలో కాని, లేక అన్నిరీతుల కలయికచే గాని కథనం సాగినా- పై నియమాలన్నీ పాటించినప్పుడే ఆకథ విశిష్టతను పొందుతుంది.

అయితే కథారచన చేసేటప్పుడు రచయిత తన రచనా విధానం ద్వారా పాఠకుని మనస్సును తన చేతితో పట్టి

వుంచాలి, పాఠకునిపై రచయిత ఈ రకమైన ఆధిపత్యాన్ని పొంది వుండగలగాలంటే- కథానిర్వహణలో అనిశ్చిత స్థితి (Suspense)ని కల్గించుతూ, క్రమంగా కథను కొనసాగించి పరాకాష్ఠను (Climax) చేరుకోవాలి. అక్కడనుండి ముగింపును- సుఖాంతమైనా, దుఃఖాంతమైనా- నేర్పుగా పరిష్కరించి పాఠకునికి ఆశ్చర్యం కలిగేలా చేయాలి. అప్పుడే కథ ఆకర్షవంతంగా రూపొంది, చిరకాలం వర్థిల్ల డానికి అవకాశాన్ని పొందడమేగాక; రచయిత పాఠకుల హృదయాల్లో శాశ్వతస్థానాన్ని సంపాదించుకోగలుగుతాడు.

### కథానికా పరిమితి ఎంత?

ఈ నియమాలతో, లక్షణాలతో, విధానాలతో రచించిన కథానిక నిడివి 2500 మాటలు కంటెమించివుండరాదు. రేడియోనుంచి వినవచ్చే విరామసంగీతం (Interlude)లా- పాఠకునికి కొద్ది నిమిషాలు కాలక్షేపాన్నీ; ఆహ్లాదాన్ని కలిగించేదిగా వుంగాలి:

### రచయిత బాధ్యతలు; కథల వుపయోగము

రచయిత కలంద్వారా సృజించబడిన ప్రతిఒక్క రచన ప్రభావమూ ఆయా కాలపు మనుషులమీద విరివిగా ప్రసరింపపడుతున్న సంగతిని చరిత్ర ఋజువుచేస్తున్నది. సమాజాన్ని పునీతం చేయడంగాని; సమకాలీన ప్రజలను చైతన్యవంతుల్ని జేయడంలోకాని రచయితకు ఏ తక్కిన వ్యక్తులకంటె ఎక్కువ ప్రాముఖ్యత ఉన్నది. కనుక సాంఘికంగా అతని బాధ్యత సునిశితమయింది. పైగా ఆ యా కాలాల దేశ చరిత్ర; సంస్కృతీ సాంప్రదాయాలు. జీవితపు విలువలు- మరొతరపు ప్రజలు ఒక్క సారస్వతం ద్వారానే ఎక్కువగా తెల్సుకోడానికి వీలుకలుగుతుంది. అందుచేత కథకుడు నిష్పాక్షిక దృష్టితో ప్రపంచాన్ని పరిశీలించవలసిన అగత్యం ఎంతైనా వున్నది. విజ్ఞాన, వినోదాలతోపాటు ప్రజల జీవితానికి ఒరవడి పెట్టగలిగే చక్కని సాధనం కథలు. కావ్యాలు. కథానికలు.

తక్కువ డబ్బులతో కొద్దిగంటల కాలం వినోదాన్ని వ్వగల చలనచిత్రానికి ఈనాడు ఎంతటి ప్రాముఖ్యత వున్నదో- అంతకంటె ఎక్కువగా- తక్కువ కాలంలో ఎక్కుడు విజ్ఞానాన్ని; వినోదాన్ని ఆ నాటి ప్రజలకేకాక తరతరాల ప్రజలకూ అందజేస్తూ, సమాజాన్ని పునీతంచేసి. సంఘానికి సత్యం, శివం, సుందరాలను సాక్షాత్కరింప జేసి ప్రపంచాన్ని అభ్యున్నత పథాలకు గొనిపోగల సామర్థ్యం కథలకు- ముఖ్యంగా కథానికలకు ఎంతైనా వున్నది.

---

# చుఱుకుదెబ్బ

## శ్రీ—అయ్యగారి నరసింహం

నడుము వంగిన వృద్ధ వనిత
బాట మెల్లగ పోవుచుండ
ఖలుడు ఒక్కడు గేలిసేయ
దలచి ఆమెకు పలికెను ॥

"భామ నీవు దేనికొఱకై
బాటయంతట వెదకుచుంటివి
పోయినట్టి వస్తువేదో
వెదకిఇత్తును చెప్పుము" ॥

అతని మాటల నాలకించి
యుక్తితో ఆ వృద్ధవనిత
పలికె నిట్టులు వానితోడ
ఆత డబ్బురమొందగ ॥

"యౌవనంబను మౌక్తికంబు
జారిపోయెను మేనినుండి
దానికొఱకై దారియంతట
వెదకుచుంటిని వోయ్ ॥

నీకదిప్పుడు కానరాదు
పోయిరావోయ్ పిచ్చివాడ
అనగ నాతడు సిగ్గుచెందె
చుఱుకదెబ్బయె తగిలినట్లుంతో" ॥

# తారామతి

కూచిపూడి—

కృష్ణా తీరస్థమైన గ్రామము.

అచటి బ్రాహ్మణులు పాండిత్యముతో కూడిన నాట్య విద్యకు పేరుమోసినవారు. నృత్యానుకూలముగా అష్టపదులు ఆలాపించుటలో, తరంగములు పాడుటలో, కృష్ణకర్ణామృతమును గానము చేయుటలో వారు సిద్ధ హస్తులు.

ముంగండ—

గోదావరి తీరస్థమైన గ్రామము.

అచటి బ్రాహ్మణు పాండిత్యముతో కూడిన వివిధ శాస్త్ర పరిజ్ఞానమునకు పేరుమోసినవారు. నాలుగు వేదములను వల్లించుటలో, ఆరు శాస్త్రములను చర్చించుటలో, సారస్వతమును సృష్టించుటలో వారిని మించినవారు నాటికి నేటికి లేరనవచ్చును.

కూచిపూడి బాపన పిల్లకును, ముంగండ బాపన పిల్లవానికిని వివాహమైనది. వివాహమైన తోడనే ఆ బాపన పిల్లవాడు ఉన్నత విద్యకై కాశీ వెళ్లెను.

కాశీలో పలుసంవత్సరములు విద్యాభ్యాసము కావించి అతడు స్వదేశమునకు తిరిగిరాక ఢిల్లీ వెళ్లి రితన అద్భుత పాండిత్యము చేతను, కవిత్వ మహత్యము చేతను మొగలు చక్రవర్తిని మెప్పించి అతని ఆస్థానమున విద్యా వినోదములతో ప్రొద్దు పుచ్చుచు జగన్నాథ పండితరాయ లయ్యెను.

ఇక్కడ కూచిపూడివారి కుఱ్ఱది ఈడేఱినది ఎంత కాలమునకు కాశీనుండి పతివచ్చెడు జాలకువ ఏమియు ఆమెకు అగపడలేదు. జరిగిన వాకబులో పతి జగన్నాథ పండితరాయలై ఢిల్లీలో మొగలు రాజాస్థానమున నుండుట తెలియవచ్చినది.

తోడనే ఆమె కూచిపూడినుండి ఢిల్లీకి ప్రయాణమైనది. ప్రయాణ మధ్యములో ఆమె మొగలు దర్బారు అప్పుడు కాశ్మీరమునకు తాత్కాలికముగ తరలియుండుట తెలిసికొన్నది. ఆమె ఎంతమాత్రము జంక కాశ్మీరమునకే ప్రయాణము కట్టినది.

ఎక్కడి కూచిపూడి! ఎక్కడి కాశ్మీరము!! ప్రియాన్వేషణార్థము వెళ్లుచున్న ఆ ఆంధ్ర రమణికి ఆ దూరము భారమనిపించలేదు.

ఆమె కాశ్మీరము చేరినది. తురక గణిత వేషము ధరించి నవనేగు లవంగి అనినది. తన నృత్య విద్యా పాటవముతో, గీత విద్యాకలనముతో మొగలు రాణి నూర్జహాను కొలువున ప్రవేశము సంపాదించినది.

ఆ నాట్య విద్యా సుందరి విషయము అచట అందఱకును తెలిసినది. ముంగండ పండితునకును తెలిసినది. రసిక హృదయుడగుట ఆ నాట్య విద్యా విదుషిపట్ల అతనికి గాఢాభిమానము కుదిరినది. ఆమెను అతడు తన దాసిగా చేకొనెను. ఆ దాసి చిరకాలమునకే అతని పదదాసి, ప్రేయసి ఐనది. లవంగిని ప్రస్తుతించుచు అతడు ప్రశస్తమైన పెక్కు శ్లోకములు చెప్పెను.

ఆ ఆంధ్ర రమణి ప్రియుని పొందుటకు కూచిపూడి నుండి దూరము, భారము అనుకొనక కాశ్మీరము వెళ్లినది, వినుటకు అద్భుతావహమైనది ఈ గాథ.

నాట్య విద్యా విదుషియగు ఆంధ్ర రమణి మూలమున కాశ్మీరమున నడచిన ఈ గాథకంటెకూడ అద్భుతావహమైన గాథ ఒకటి నాట్య విద్యా విదుషియగు మరియొక ఆంధ్ర రమణి మూలమున ఆంధ్ర దేశముననే నడచినది.

కొంచెము ఇంచు మించుగా లవంగి కథ జరిగిన శతాబ్దిలోనే ఈ కథయు జరిగినది.

ఈ కథా నాయకురాలి నామము తారామతి. లవంగివలె ఈమెయు అందమైనది; నాట్య విద్యలో అందెవేసినది. ఐతే తారామతి లవంగివలె తురక వేషము వేయలేదు. ప్రియుని కోసము కృష్ణా తీరము నుండి కాశ్మీరము వఱకు గలంతటి దూర ప్రదేశమునకు ప్రయాణము చేయలేదు.

తారామతి తురక వేషము వేయలేదు. కాని తురక ప్రభుని చేపట్టినది; ఆ తురక ప్రభువు కొఱకు ఆమె, దూర ప్రయాణము చేయలేదు. కాని దుస్తర ప్రయాణము చేసినది. ఆ చేయుట ఒక్కసారి కాదు. దిన దినమును మాపటివేళ ప్రియుని కొఱకు ఆమె కొన్ని వత్సరములు ఆ దుస్తర ప్రయాణము చేసినది.

ప్రయాణము చేయవలసిన దూరము ఒక మైలు మాత్రమే. ఒక్కగా నొక్క మైలు! కూచిపూడి నుండి కాశ్మీరము వఱకు గల దూరములో ఇది వెయ్యోవంతుకూడ కాదు. ఐనను కాశ్మీర ప్రయాణముకంటె ఈ మైలు ప్రయాణమును వెయ్యిరెట్లు

దుస్తరమును, దుర్భరమును ఐనదని సందర్భమంతయు తెలిసికొనినచో పాఠకులకు అవగతమగును.

గోలకొండ కోటకు ఒక మైలు దూరమున ఒక చిన్న కొండ మిట్ట. ఆ మిట్టమీద రెండంతస్థుల మేడ. ఆ మేడ చతురస్రముముగా అన్నివైపుల బలమైన కమానులతో సుందరముగ నిర్మితమైనది.

ఆ మేడ తారామతిది. ఆమె వెల్లాటకత్తె.

ఆ మేడ పగలంతయు నృత్య గీతాది ప్రసంగములతో ముఖరిత మగుచుండునది. రాత్రికాగానే అక్కడ నిశ్శబ్దము విరాజమ్మాన మగుచుండునది. ఏమన, తారామతి రాత్రి స్థలాంతరమునకు పోవుచుండునది. ఆ పోవుట భూమిమీద నడచికాదు. ఆకాశమున ఎగిరి కాదు.

మఱి ఎట్లందురా? ఆకాశ మార్గమున పాదములతో నడచి. వింతయైన విషయము.

తారామతి నాటి గోలకొండ పాలకుడగు అబ్దుల్లా వలపునెలత. గోలకొండ కోటలోని అబ్దుల్లా మందిరమునకు తారామతి మేడకును ఒక బలమైన మోకు కట్టబడి యుండెను.

రాత్రి కాగా తారామతి ముస్తీబై ఆ తాటిమీద నడచుచు ప్రతి దినమును అబ్దుల్లా మందిరమునకు పోవునది, చేతికి అందు దూరమునకు ఆమె సమీపించుట తోడనే, నవాబు అబ్దుల్లా హస్తావలంబనమిచ్చి ఆమెను తన మందిరములోనికి దిగుచుకొనువాడు.

తారాపథ మార్గమున తాడుమీద పాదద్వంద్వార్పణామతియై తారామతి దిన దినమును ఇట్లు తన ప్రియునివద్దకు పోవునది. ఆ అభిసారికను అప్పుడు అబ్దుల్లా ఆలింగనములతో అభినందించువాడు.

తాటిమీద నడక. అదియు మాపటివేళ. పది అడుగులుకాదు, పది గజములు కాదు. పదునేడు వందల అరువది గజముల దూరము. ఇంత దూరము తూకము సమముగా నిలువుకొనవలెను. ఒకింత ప్రక్కకు తూగినదా వరిముల్లు వాసితూవినదా, ఇక ఆమె పతన్నక్షత్రమే. ఈ స్థితిలో తాడుమీద తణుకు బెణుకు లేకుండ నడచిపోవుటకు పాద విన్యాసమున అమె ఎంత పారము ముట్టిన పండితుర్కాలై యుండెనో?

కాలు జారినను కలసివచ్చును, కాని నోరు జారిన కలసిరాదను పెద్దల వాక్యమునకు పూర్తి విపర్యాసము వచ్చిన పరిస్థితి అది. తాటిమీద నడుచుచుండగా తారామతినోరు జారినను పకాలునికావారదులే,. జారినచో ప్రాణము జారినదన్న మాటయే.

అగుటకు ఆమె వెల యాతే. కాని ధనార్జన దృష్టి తోడనే ఆమె ఈ అద్భుత కార్యము చేయుచు వచ్చినదని ఎంత మాత్రము చెప్పలేము. ప్రియునిపట్ల ప్రాణాధికమైన ప్రేమాభిమానములు కుదురుట చేతనే అనుక్షణ ప్రాణాపాయ శంకగల ఈ పరమ సాహస ప్రయాణమును ఆమె పరిపాటిగా చేయుచు వచ్చినది,

ప్రియుడైన ప్రభువు ప్రశంసనందుటకు ఆమెకుప్రతి దినము ఈ అద్భుత కార్యము అలవోక కార్యమైనది.

నేడును దొమ్మరిసానులు—కొద్ది దూరమేయగు గాక—తాటిమీద నడచెడు ప్రదర్శనములను చేయుచుండుట మనము చూచు చున్నాము. కాగా తారామతి చేసినపని అద్భుతమైనదే ఐనను బొత్తిగా అసాధ్యమైనదని కాని, పూర్తిగా అవిశ్వసనీయమైనదని కాని అనలేక పోవుచున్నాము.

గోలకొండ నవాబుల వలపు నెలతలలో ముగ్గురి నామములు ప్రఖ్యాతములై ఉన్నవి. ఆ ముగ్గురును భాగామతీ పేరనే భాగ్యనగరము—నేటి హైదరాబాదు—నిర్మితమైనది. భాగామతి బారదారికి సమీపముననే ప్రేమమతి బారదారి శిథిలములు గోలకొండ కోటవద్ద నేటికిని కలవు అట్లే మన కథానాయకురాలి మందిరముల శిథిలములును అచ్చట కలవు.

ఏ మందిరము నుండి ఆకాశ వీధిలో తాటిమీద హంస నడకతో అనుదినము అభిసారికయై తారామతి అబ్దుల్లావద్దకు పోవుచుండినదో ఆ మందిర శిథిలము నేటికిని కలవు. హైదరాబాదు నుండి ఉస్మానుసాగరుకు వెళ్లు రోడ్డు మీదనుండి బస్సుమీద పోవుచునే మనము వానిని అల్లంత దూరమున స్పష్టముగా చూడవచ్చును. ఈ నివాస మందిరమేకాక ఆమె సమాధి మందిరముకూడ నేటికిని గోలకొండలో ఉండి చరిత్రాభిరతులకు ఆమె అద్భుత గాథను జ్ఞప్తి కెలయించుచున్నది.

క్రింద కాలు మోపకుండ నడచుటచే తారామతిని దేవతాస్త్రీగా పరిగణింప వచ్చును. కాని నిజమునకు ఆమె తారాపథమున మామూలు పాదములతో నడచిన మానవ మహిళ,

మామూలు పదములతో తారాపథమున నడచిన ఆ తారామతి ఇప్పటికి మూడు వందల పండ్ల మునుపు ఉండినది.

ఆంధ్ర శేషగిరిరావు, బి.ఏ.

# దీపావళి

## వే. వేం. కృ.

పౌరాణికంగా ఆశ్వయుజ బహుళత్రయోదశీ చతుర్దశీ తిథుల మధ్యకాలంలో శ్రీ కృష్ణుడు నరకాసురుణ్ణి సంహారించిన సందర్భాన్ని పురస్కరించుకొని ప్రతియేట పండుగ చేసుకోవడం భారతీయులకు ప్రాచీనకాలంనుండి ఆచారంగా యేర్పడిపోయింది.

భూదేవి, తనకొడుకైన నరకాసురుడు మరణించిన దినము, సంతాపాన్నికాక సంతోషాన్ని ప్రకటించే దినంగా వరం అనుగ్రహించమని కృష్ణభగవానుణ్ణి కోరింది. అలా ఆమె కోరటానికి కారణం ఆ దినం (ఆశ్వయుజ—కార్తిక సంధికాలంలో) గంగానది పవిత్రశక్తి ప్రపంచంలోని జలాలన్నిటికీ వ్యాప్తించి వుంటుందనీ అట్టి సమయంలో తెల్లవారకముందే, అభ్యంగనస్నానంచేసి నూతన వస్త్రాలు ధరించి మానవులు భగవత్కృపకు పాత్రులు కావాల్నని.

ఉపనిషత్తులను ఆధారంగా చేసుకొని దీపావళి మహిమనుగూర్చి. మతాచార్యులు ఈ క్రిందిమోస్తరు వివరించారు:

"కడచిన సంవత్సరమల్లా. తమ ప్రవర్తనలోని దుస్స్వభావాలూ, దుష్కార్యాలూ. ఆసుర చేష్టలూ. మొదలయిన వాటిని ఆదినంతో మానివేస్తామనీ. ఇకమీద తాము సక్రమంగా నడుచుకుంటామనీ, భగవంతుడు ప్రకాసింపజేసే విజ్ఞానవు వెలుగుబాటల్లో పవిత్రవంతంగాను, అభ్యుదయకరంగాను జీవితం గడుపుతామని ప్రతిజ్ఞచేసే శుభదినమే దీపావళి"

ఒక క్రొత్త మనోనిశ్చయం. ఒక క్రొత్త శపథం, ఒక కొత్తదృఢసంకల్పం—కలిగి తోడిమానవుల యెడల ఆదరానురాగాలతో మెలగడమే ఈ పండుగయొక్క ముఖ్యోద్దేశమని దీనివల్ల తెలుస్తుంది.

దీపావళినాడు బాణసంచాల కాల్పుల ఐతిహ్యాన్ని గూర్చి దక్షిణదేశంలో ఒకకథ వాడుకలో ఉంది. పౌరాణికంగా అది ఎంతవరకు సత్య సమ్మతమో తెలియదు

ఒకప్పుడు భూదేవి తనభర్త అయిన శ్రీహరిని ప్రార్థించి "వైష్ణవాస్త్రా"న్ని తనకుమారుడైన నరకాసురుడికి అనుగ్రహింపుమని వేడుకోగా, శ్రీహరి అలాగే చేశాడు.

మహాభారతయుద్ధం కురుక్షేత్రంలో ప్రారంభమయ్యేనాటికి నరకాసురుడి కుమారుడయిన భగదత్తుడు ప్రాగ్జ్యోతిష అధిపతి అయినాడు. అయినా అతడి తంత్రిమాయలు. దౌర్జన్యాలు, దుశ్చేష్టలు మొదలైన వాటితో పాటు "వైష్ణవాస్త్రం" కూడా అతడికి సంక్రమించింది. మాయావి అయిన భగదత్తుడు కౌరవుల ఆహ్వానాన్ని అనుసరించి, వాళ్ళకి యుద్ధంలో సహాయంచేసే వుద్దేశంతో పెద్ద సేనతో కురుక్షేత్రానికివెళ్ళాడు. ఎలాగైనా అర్జునుణ్ణి వైష్ణవాస్త్రంతో సంహారించగలననే గర్వంతో ఆ అస్త్రాన్నికూడా మరవకుండా తీసుకొనిపోయిచేరాడు

ఆ పద్దెనిమిది దినాల ఘోరసంగ్రామంలో ద్రోణాచార్యుని సేనానాయకత్వంక్రింద భగదత్తుడు అర్జునుణ్ణి ఎదుర్కొని పోరాడవలసినట్లు తటస్థించింది. అట్టి సమయంలో భగదత్తుడి అసురమాయలుగానీ, భుజబలసామర్థ్యంగానీ, ఏ మాత్రం పనికి వచ్చినాయికావు. కడకు తండ్రి తనకిచ్చినదీ వైష్ణవమాయకు లోబడ్డదీ అయిన "వైష్ణవాస్త్రాన్ని" కిరీటిమీద గురిపెట్టి ప్రయోగించాడు. పార్థసారథి (శ్రీకృష్ణుడు) బావమఱదికి కలగబోయే ప్రాణాపదను గ్రహించాడు. భగదత్తుడి క్రూరసంకల్పాన్ని పడగొట్టే విషయంలో ఏ మాత్రం ఆలస్యంచేసినా, ప్రయోజనం లేదని తెలుసుకున్నాడు ఆ మహాస్త్రము ఉరుములు మెరుములు కక్కుతూ—పిడుగుమోస్తరు పెద్దశబ్దంతో మింట రావటాన్ని చూచాడు. రణరంగంలో యోధానయోధులుకూడా నిశ్చేష్టులై విస్మయావిష్టులై నోళ్ళు తెఱచుకొనిచూస్తూ నిలబడ్డారు.

శ్రీ కృష్ణుడు తటాలున నొగల మీదనుండి లేచి, విజ్వచ్చుడికి ముందుదూకి నిటారుగా నిలబడ్డాడు. ఆ పే

పద్ధతిలో కుడిచేతిని ముందుకు చాచాడు. దశదిశల వ్యాపించే మంటలతో వస్తూవున్న ఆ వైష్ణవాస్త్రం అతని ముఖాన్ని ఆవరించివున్న కాంతి మండలంలో చిన్న నక్షత్రం మోస్తరు ప్రవేశించింది శుద్ధసత్త్వగుణ సంపన్నమైన ఆ తేజోమండల ముఖారవిందంతో ఆయన ఆ వైష్ణవమాయాస్త్రాన్ని తన కంఠంలో ధరించాడు. అంతే! అది ప్రశాంతాన్ని వహించినా. నక్షత్రాలమోస్తరు నానావిధ వర్ణములతో గూడిన పూలగుత్తులతోడి వనమాల అయి ఆయన మెడలో నేటికీ ప్రకాశిస్తున్నది.

అది స్ఫురించేట్టుగానే (మావిళీలు) బొగ్గుపొడి ఉప్పురాళ్ళు కలిపి పొట్లం మోస్తరు ముతకగుడ్డలో కట్టి, పొడుగైన త్రాటికొనాన మట్టసంగా ఇమిడ్చి వాటిలో నిప్పురగిల్చి, పల్లెటూళ్ళలో, వీధులలో నిలబడి పిల్లలు గిర్రునచుట్టుతుంటారు. అవి నానావన్నెల మిణుగుర్లు రాలుస్తూ చక్రాల విధంగా కనబడతాయి. తాటాకు టపాకాయలుకూడా కొన్నిచోట్లపేలుస్తారు.

పట్టణ వాసులకు చక్రబాణాలు. సురసురాలు, కాకరపూవత్తులు, మతాబులు, పలువన్నెల పిల్లలఅగ్గిపెట్టెలు-!- "ఒకటేమిటి?- విత్తంకొద్ది విభవం - ఏతావాతా తేలినదేమంటే, ఇవన్నీ అనేకవర్ణ చిత్రిత పుష్పలతా శోభితమయిన శ్రీ కృష్ణభగవానుడి వళీమాలను జ్ఞప్తికి తెచ్చేవని.— అందరికీ మా దీపావళి శుభాభినందనాలు!

---

# రచయితలకు విజ్ఞప్తి

1. రచయితలు ముఖ్యంగా మహిళాభ్యుదయాన్ని దృష్టిలో ఉంచుకొని. తదనుగుణంగా, పేజీకి ఒకతట్టే విడివిడిగా వ్యాసాలు వ్రాసి పంపాలి.

2. కథలు, కథానికలు మొదలగునవి ఒకే సంచికలో ప్రచురించటానికి అనుకూలంగా నాలుగైదు పుటలలో ముగిసేటట్లు వ్రాయాలి.

3. మహిళా మణులు వ్రాసి పంపే రచనలకి ప్రాధాన్యం ఇవ్వబడుతుంది.

4. ప్రచురింపబడని వ్యాసాలు త్రిప్పిపంపటం సాధ్యంకాదు. రచయితలు ముందే ఒక కాపీ వ్రాసి ఉంచుకోవడం మంచిది.

5. రచయితలు పంపే వ్యాసాలలోని అభిప్రాయాలకు పూర్తిగా వారే పూచీ వహించాలి. ఆంధ్ర మహిళకు వాటితో ఏలాటి సంబంధంలేదు.

6. రచయితలు పంపే రచనలు చేరినట్లు వారికి తెలుపగలం, కాని వాటి ప్రచురణలను గూర్చి వ్రాసే జాబులకు జవాబులు వ్రాయబడవు.

మేనేజరు
'ఆంధ్ర మహిళ'
7. ఎ. రోజర్‌చర్చిరోడ్డు
మైలాపూరు మదరాసు-4

# ANDHRA MAHILA SABHA

## NURSING HOME & NURSES' TRAINING CENTRE

### Statistics for the month of September, 1960.

**OUT-PATIENT REGISTER**

| | | |
|---|---|---|
| | No. of Surgical cases treated | 33 |
| | ,, ,, Medical ,, ,, | 483 |
| | ,, ,, Gynaec ,, ,, | 82 |
| | ,, ,, Ante-natal ,, ,, | 262 |
| | ,, ,, Post-natal ,, ,, | 58 |
| | ,, ,, Dental ,, ,, | 5 |
| | ,, ,, E.E.N.T. ,, ,, | 69 |
| Tota | ,, ,, New Patients | 1,343 |
| ,, | ,, ,, Old Patients | 1,760 |
| | Grand Total | 3,103 |

**IN-PATIENT REGISTER**

| | |
|---|---|
| No. of Patients admitted of Normal Deliveries | 134 |
| ,, ,, ,, ,, Abnormal Deliveries : (Forceps 6 M.R. of Placenta 1, Extractions Breech-1 | 8 |
| No. of Ante-natal E False Pains | 19 |
| ,, ,, Ante-natal E Toxeamia | 2 |
| ,, ,, Gynaec cases | 17 |
| ,, ,, Medical ,, | 73 |
| ,, ,, Surgical ,, | 1 |
| ,, ,, Post-natal ,, | Nil |
| ,, ,, Babies admitted as Lodgers | 141 |
| Grand Total | 395 |

(Sd.) Dr. K. R. AMBUJA,
*R M. O.*

(Sd.) Dr. M. PAVANA BAI,
*Medical Superintendent.*

(Sd ) Smt. V. LAKSHMI PARVATHI,
*Secretary.*

# మనిషి - మనసు

"యశో"

"ఏమీలేదు. మనుష్యుల సంగతి తెలుసుకోవడం కోసమేనేనలాచెయ్యాల్సివచ్చింది. మనుష్యులవిలువలు గుర్తించకపోతే నేనిప్పటికేకాదు ఎప్పటికినోరువిప్పేవాడినేకాదు. ఇప్పుడామె కేవలం లక్షలనే కాదు లక్ష్యాలనికూడా సాధించిన ధన్యజీవి" అన్నాడు విశ్వం.

"మీరు మరీను. మహా చిత్రంగామాట్లాడతారు" అంది శశిరేఖ. "చిత్రంకాకపోతే ఏమిటి మనకథ, మన కలయిక; నిజంగా చిత్రమైనదికాదా. ఉన్నమాటంటే అంత ఉలుకుదేనికి; అని విశ్వాన్ని వెనకేసుకొచ్చింది లత.

"అబ్బే అంతకే అలా ఇదయిపోతావేమిటి శశిరేఖా. నిజానికి ఇదంతా ఇంత సుఖాంతంగా ముగుస్తుందని మేమెవరు అనుక్కోలేదు. ఏమైనా అదృష్టవంతురాలివి" అభినందిస్తున్నట్టు అన్నాడు ప్రసాద్.

"నాదేముంది అంతా ఆ విశ్వేశ్వరుని కృప" అంది రేఖ విశ్వాన్ని వేలుతో చూపుతూ.

"అదిగో మళ్ళా మీరంతాకలిసి ఈవారం వారఫలాలులో వ్రాసిన అకారణకీర్తి యోగాన్ని నిజం చేసేటట్టున్నారే" అంటూ ఛలోక్తి విసిరాడు. నాల్గు కంఠాలు ఖంగుమన్నాయి.



ఆరోజునే ముసాబుగా ఉంది. ఉన్నవానజల్లు పూలజల్లులాగా తుంపరలుగా పడుతోంది. ఉన్నట్టుండి గాలి ఒక్కొక్క విసురు విసురుతోంది. అవిసురుకి మేఘాలు చెదరిపోతున్నాయి. అరుగుమీద నిల్చుండి వానకేసిచూస్తూ నిలబడ్డ లతకి పడవ చెయ్యడంకోసం కాయితం మడతపెట్టున్న రవి కన్పడ్డాడు. పడవ కట్టడంలో సరిగ్గా గంటనుంచి సతమతమై పోతున్నాడు వాడు. వాడి పాట్లు చూస్తుంటే లతకి జాలి వేసింది. ఆప్యాయంగా వాడిదగ్గరికి వెళ్ళింది. ఆ పక్కనేపడివున్న కాయితంతీసి పడవచేసింది. కాలువకట్టి పల్లానికి ప్రవహిస్తున్న వాననీటిలో పడవని వదిలింద. "తమ్ముడూ" అంది అలలపై తేలియాడుతూ. గబగబా పోతున్న పడవను చూడగానే రవి గట్టిగా నవ్వాడు. ఇద్దరూ తప్పట్లు కొట్టారు. "మరినాకో" అన్నాడు రవి. "అయితేసరే ఇంద" అంటూ ఇంకో కాయితంతీసి లత గబగబ మడిచి పడవ కడుతోంది. ఇంతలో "రామారావుగారు వున్నారా" అన్న అపరిచిత కంఠంవిని లత ఆశ్చర్యంగా తలెత్తిచూసింది. ఎవరోకొత్త అబ్బాయి. అందంగా వున్నాడు. ఆజానుబాహువు. అతనుకూడా లతకేసి అదోలా చూస్తున్నాడు. లత ఆ చూపునుంచి తప్పించుకుని ఒక్క అంగలో లోపలకి వెళ్ళి తండ్రిని పిలుచుకొచ్చింది. ఆయన వస్తూనే "రండి రండి" అని ఆ యువకుని ఆహ్వానించాడు. కుశలప్రశ్నల అనంతరం ఆ అబ్బాయిది మద్రాసని తేలింది. ఆవూరు అతనికి క్రొత్త కనుక జమీందారు మధుమూర్తిగారి పొలాలెక్కడ వున్నాయో తెలుసుకోడానికి వచ్చాడుట. ప్రసాద్‌ని చూడగానే లత మనస్సులోకి అనేక రకాలైన ఆలోచనలు మెరపులా మెరసి మాయమై పోతూవచ్చాయి. ఏదో పూర్వపరిచయం వున్నట్లు, అతన్ని అంతకు ముందు ఎక్కడో చూసినట్లు అదేమిటో తనకు అంతుపట్టనట్లు కలవరపడ్డం ప్రారంభించింది. ఆలోచించి ఆలోచించి అలా సాయంత్రందాకా ఆలోచిస్తూనే వుంది. మధ్య మధ్య తన మనస్సును తానే సంబాళించుకుంటోంది. "ఆ అబ్బాయెవరో మనమెవరమో" అతనెవరైతే మనకిదేనికి? మనకేవిటి సంబంధం. అనుకునేది. అంతలోనే మళ్ళీ ఇంకోసారి "నాన్నగారి దగ్గరకి ఇలాంటి పనులమీద ఎంతమంది వచ్చి వెళ్ళడంలేదు. అందులో ఎంతమంది యువకులులేరు. వీవ్వరిని చూసినా కలగని ఈ అనుభూతి ఇతన్ని చూస్తూనే

కలగడం ఏమిటి? ఏమో" అని మధనపడేది. చూడ చక్కని వాడనా! ముద్దొచ్చేటట్లు మాట్లాడుతాడనా చదువూ సంస్కారం కలవాడనా ఇవన్నీ వున్నా యనా లేక అవేమీ లేవనా. అతనంటే ఎందుకీ ఆకర్షణ. ఎందుకీ అకారణమైన ఆవేదన. అని తనలో తానే తర్జన భర్జనలు పడుతూండేది.

ఏమీతోచక పోవడంతో లతకి ఏమి తట్టిందో ఏదో హటాత్తూగా లేచింది. గబగబా ముస్తాబయింది అల వాటు ప్రకారం అలా తోటకేసిబయల్దేరింది. తోటలో చెరువుగట్టున పావంచామీద కూర్చుంది. చినుకు తరు వాత చినుకుగాసడుతూ చెరువులో అలలు రేపుతున్న నీటి తుంపరలను చూస్తూకూర్చుండి పోయింది. ప్రసాద్ కూడా ఏదో ఆలోచిస్తూఏస్తున్నాడు అప్పటి కప్పుడే జమీంచారుగారి పొలందగ్గరకి వెళ్ళి పెంద రాళే ఇంటికి చేరుకోవాలనో ఏమో తొందర తొంద రగా వస్తున్నాడు. వస్తూ, పరధ్యానంగా దిక్కులు చూస్తూన్నాడు. వస్తూ వస్తూ అటు చుచాడు. ఎదు రుగా గున్న మామిడి చెట్టుని చుట్టుకున్న మాధవీలత మనోహరంగా కన్పడింది. దాన్నిగురించి అలోచిస్తూ చెరువుగట్టు ఎక్కాడు. పూలజల్లులా పన్నీటి తుంప రలులాకురుస్తున్న వాన, చుట్టూ చిగురించిన ప్రకృతి, చెమరించినభూమి, చలి చలిగా, చల్లగా, మెల్లగా, వీస్తున్నగాలి, అన్నింటినీ మించి ఏకాంతము ప్రశాం తము. ఈ ఆలోచనలతో మానవుడు నిజంగా మై మరచినట్లేవున్నాడు అలా ఏవేవో ఆలోచనలతో చెరువుగట్టెక్కాడు. ఎక్కుతూనే కాలుజారి పడ్డాడు. ఎదురుగా పావంచాలో ఆలోచిస్తూ కూర్చున్న లతకు ఈదృశ్యం కంటపడింది. "అరే" అంది అప్రయ త్నంగా. ఆ మాటవిని "ప్రసాద్" ఇక్కడ ఈవేళ ప్పుడు ఎవరున్నారోచెప్మా అనుకుంటూ అన్ని వేపులా కలయ చూచాడు. అప్పటికప్పుడే తనకేసి వనలక్ష్మి వలె వయ్యారంగా నడచివస్తున్న లత కన్పడింది. సిగ్గుతో కుచించుకుపోయాడు. మెల్లిగా కాలు చెయ్యి కూడదీసుకునిలేచాడు. బట్టలన్నీ బురదయి నందుకు వెధవ పల్లెటూరని తిట్టుకున్నాడు.

ఇంతలో లత అతని దగ్గరకు రానేవచ్చింది. "దెబ్బ ఏమీ తగల్లేదు కదా" అని అడిగింది సవి నయంగా.

"మీరా.. మీరు కరణంగారి అమ్మాయికదూ" అని అడిగాడు. దేన్నో జ్ఞాపకం చేసుకుంటూ, అవును" అంది లత. "మీరు ఇలా వచ్చారేం" అన్నాడు "ఏం వస్తే" మాతోటలోకి నేనువచ్చాను. నాకు చెరువన్నా చెట్లన్నా చాలా ఇష్టం, చిన్నప్పటి నుంచి అంతే ఏమీ తోచనప్పుడల్లా వస్తువుంటా అంది లత" "మరిమీరో" అని అడిగింది. నాకు రమణీయమైనదేదైనా ఇష్టమే అన్నాడు. పడ్డ సిగ్గునంతా కొంటెతనంగా మార్చి చూపులో మేళవించాడు. "నాకు ఏమీ తోచడం లేదు. అందులో ఈ పల్లెటూరిలో మరీని. అందుకని ఇలా వచ్చాను" ఆమాట వినగానే లత కెందుకో ఫక్కున నవ్వువచ్చింది. "ఈ వూళ్ళో తోచనిదాన్ని నేనొకర్తినే అనుకున్నాను" అంది. "అబ్బే అలా ఎప్పుడూ భ్రమపడకండి" ఆ మాటకి ఇద్దరూ ఒక్క సారి నవ్వుకున్నారు అంతలో ప్రొద్దుగూకింది ఎవరి దోవన వారు వెళ్ళారు

♦ ♦ ♦

మళ్ళీ మర్నాడు అదే సమయంలో అదే దృశ్యం అదే మనుష్యులు, అదే ఏకాంతం అదే ప్రశాంతం. అయితే అక్కడ నిన్న వున్నదీ నేడు లేనిదీ ఇద్దరి మధ్య క్రొత్తదనం ఇద్దరూ చెరో వైపునుంచి వచ్చి చెరువుగట్టెక్కారు. ఇతను ఇటునుండి వచ్చాడు. ఆమె అటునుంచి వచ్చింది. వస్తూనే ఒకరిని వొకరు చూసు కున్నారు. చూచుకుంటూనే చిరునవ్వులు విసురు కున్నారు. నవ్వుతూనే చూపులు చూస్తు నే నవ్వులు పేటితోబాటే మనస్సులు కలుపుకొన్నారు ఏమో !

ఇక్కడ ఎంతో హాయిగా వుందికదూ అన బోయాడు ప్రసాద్. "ఇంతకీ మీకు చట్ట ఏదీ నొప్పి పెట్టలేదు కదా" అంది లత. "అబ్బే ఆటలో అరటి పండు. ఆ సంగతి అప్పుడే మరచిపోయాను. మరచి పోనిదల్లా మిమ్మల్ని మాత్రమే'' "అన్నాడు. పరి హాసంగా, "మీదంతా మరీ ఆశ్చర్యం, మీక్కూడా సరిగ్గా ఈ వేళప్పుడే తోచకుండా పోయిందేవిటీ అనీ ఆశ్చర్యపోతున్నాను" అందిలత. మిమ్మల్ని చూస్తూనే నాకు అలానే అన్పించింది. మనిద్దరికీ రోజూ అస్త మానం ఇలా తోచకుండా పోతూవుంటే ఎంత బావుంటుంది నాకేమో ఎలాగా తోచడంలేదు" అన్నాడు ప్రసాద్. "ఇంక తోచేదాన్ని నేనేనా" అంది లత. "అయితే మీకు ఈ తోచకపోవడం ఎప్పటి నుంచీ" అన్నాడు కొంటెగా "నిన్న ప్రొద్దుటినుంచి" అందిలత.

"అన్నట్టు. మరచిపోయాను. మిమ్మల్ని ఏదో అడుగుదామనుక్కున్నాను" అన్నాడు.

"సమయానికి బాగా జ్ఞాపకంచేసారు. నేనూ మిమ్మల్ని ఏదో అడుగుదాం అనుకున్నాను" అంది లత.

"దేన్నిగురించి" అన్నాడు.

"దేన్నిగురించి" అందిలత. ఆ అనడం ఇద్దరూ ఒక్కసారే అన్నారు. ముందుమీరు చెప్పండి అంది లత. "కాదు మీరేచెప్పండి" అంటూంటే మళ్ళీ ఇద్దరి చూపులు అప్రయత్నంగా కలిసాయి. ఆ సమయంలో లత చూపు తాకిడికి ఇద్దరి వళ్ళు జల్లుమన్నాయి. ఏదో ఒక తీయని ఆవేశం ఇది అది అని వివరించి చెప్ప రాని ఆవేశం వాళ్ళిద్దరికీ కల్గినట్లు అన్పించింది. ఇద్ద రికీవళ్ళు జల్లుమన్పించింది. ఇద్దరు ఒక్కనిముషం నిశ్శబ్దంగా వున్నారు. అతనే ముందు తేరుకున్నాడు, అతనే పలుకరించాడు. "దేన్నిగురించో చెప్పండి మరీ" అన్నాడు. లత ఏదో చెప్పబోయినట్లు కన్పించింది. అంతలోనే "ఎందుకు లెండి. మీరేచెప్పండి" అనేసింది. "అబ్బే దేన్నిగురించికాదు. మనల్నిగురించే" అన్నాడు.

"ప్రసాద్ అంత చనువుగా మాట్లాడ్డంపైకి అంత ఇష్టంలేనట్ల నిపించినా లతకి ఎందుకో సరదాగానే వుంది "అదే-చెప్పండి" అంది.

ప్రసాద్ తట పటాయిస్తూ ఎదురుగా వున్న మామిడి గున్ననీ దాన్ని పెనవేసుకున్న మాధవీలతని చూపిస్తూ "అవి ఎంతోబాగున్నాయి కదూ" అన్నాడు.

"ఆహా'' అంది లత "మరి. మీకునన్నంటే ఇష్టమా అన్నాడు.

"అలా ఎందుకనుకున్నారు" అంది లత.

"అబ్బే. మీకు సరిగ్గా ఈవేళప్పుడే తోచకపోతేను అనుకున్నాను'' అన్నాడు.

మరి. ఇదేప్రశ్న నేను మిమ్మల్ని అడిగితేనో అంది లత.

"అడగండి''

"అడిగితే''

"ఇష్టమే అంటా'' అన్నాడు. "మీకూ అంతే అనుకుంటాను" నేను వూరికే చనువుగా మాట్లాడుతానుట. అంత మాత్రానికే అలా అనుకుంటే ఎలా" అంది లత ఆమాటకు ప్రసాద్ కొంచెం చిన్న బుచ్చుకున్నట్టు కన్పించాడు.

అంతలోనే లత అందుకుంది ఇంతకీ నేనే మన్నాననీ మీరంత చిన్న బోవడానికి. మీరంటే నాకిష్టమే గాని అనీ"

అర్ధోక్తిలో ఆపివేసింది లత క్రిందికిచూస్తూ కాలి బొటన వ్రేలితో నేలనిరాస్తో.

"అయితే మీకు డబ్బున్న వాళ్ళంటే ఇష్టమా'' అన్నాడు. ''అబ్బే డబ్బుదేముంది. మనసు మనిషి మంచివైతే చాలు అంది యాధాలాపంగా లత.

"అయితే ఒక్కమాట మీరు ఒప్పుకుంటే సంతోషిస్తా. నిన్న మీరు క్రొత్త వాడినని కూడ ఆలోచించకుండా కాలుజారి పడ్డప్పుడు చేయూత ఇవ్వడానికి ముందుకొచ్చారు, నాక్కావలసింది అప్పుడుకాదు. ఇప్పుడూ. ఇప్పటినుంచి ఎప్పుడూ అన్నాడు.

లత "దానికేముందిలెండి. నాకంతకంటె కావలసిందేముంటుంది ఇంతకీనేనుచేసింది మాత్రమేముంది'' అలాగేలెండి"

అంది అమాయకంగా.

''ఆలోచించుకు మరీ చెప్పండి"

"నా ఆలోచనదేనికి. మీకు మాత్రం తెలియదూ. ఆలోచనఅంతా మానాన్నది. ఆచరణ అంతానాది'' అంది.

''సరే అయితే" అన్నాడు.

* * *

కరణంగారు ప్రసాద్‌కి లతనిచ్చి సాలంకృత కన్యాదానంచేసి సలక్షణంగా పెళ్ళిచేసారు. అంతా సవ్యంగానే జరిగింది. కానీ ఈ పెళ్ళికి ప్రసాద్ తరఫున ఎవరూరాకపోవడం మాత్రం ఆవూళ్ళో అందరికీ ఆశ్చర్యం కలిగించింది. వచ్చిన వారందరికీ కరణంగారు ప్రసాద్‌ను మా అల్లుడంటూ సాదరపురస్సరంగా పరిచయంచేసారు. పట్నంలో వుద్యోగం చేస్తున్నాడనీ. 150 రూ జీతమని తనతాహతుకి ఇంతకంటే మంచి సంబంధం తేలేననీ ఎమిటేమిటో చెప్పుకుంటూ పోతున్నాడు. ప్రసాద్ ఇవన్నీ వింటూ ముసిముసి నవ్వులు నవ్వుతూ వచ్చిన పెద్దలందరికీ నమస్కరించి ఆశీర్వచనాలందుకున్నాడు. లాంఛనాలన్నీ అయ్యాక లతతో

కాపురం పెట్టుకుంటానని చెప్పి లతని తీసుకు పట్నానికి బయల్దేరాడు.

* * *

లతకి పట్నం క్రొత్త. ఆమాటకొస్తే అంతా క్రొత్తే సెంట్రల్ స్టేషను, అక్కడికార్లు, అక్కడిరొద, అక్కడి హడావిడి అంతా అదోలావుంది. ఎవరెవరో వచ్చారు. ఎందరెందరో వచ్చారు. అందరూ ప్రసాద్‌ని పలుకరించారు. అభినందించారు. అందులో ఒకరు లతకేసి చూసి "నువ్వెంతో అదృష్టవంతురాలివమ్మా" అన్నారు. మరొకరెవరో వచ్చి రెండు పూలదండలు తెచ్చివేసారు. ఇంతలో పైనుంచి క్రిందకంటా కాకీ దుస్తులు ధరించిన ఒక పెద్దమనిషి వచ్చి "అయ్యగారు దయచేయండి"అన్నాడు వాళ్ళుబయలుదేరి ఒక పెద్ద ప్లిమత్ కారుదగ్గరకు వెళ్ళారు. ప్రసాద్ అందులో ఎక్కాడు. లతనికూడా ఎక్కించు కున్నాడు. లత ససంభ్రమంగా సర్దుకు కూర్చుందోలేదో కారు రోడ్డు మీద నున్నగా దూసుకుపోవడం మొదలెట్టింది లతా పట్నంవింతలు నువ్వెరుగవు. చూసినకొద్దీ ఆశ్చర్యంగా వుంటాయి. ముందుగా మనం మాదగ్గర చుట్టాలింటికి వెళ్దాం. అక్కడ మనకేపీ లోటుండదు. మన ఇల్లులాగే మసలు కోవచ్చు. స్వపరభేదం లేనివారు నువ్వేం చేసినా చెల్లుతుంది. అంత చనువుగావుంటారు కొన్ని రోజులపాటు అక్కడ వుండి మనఇంటికి వెళ్దాం. క్రొత్తలేకుండా స్వేచ్ఛగా వుండు. అన్నాడు. సరే అంది లత.

కారు అలా వెళ్ళి పెద్ద భవనంముందు పోర్టికోలో ఆగింది. లత తన కుడివేపు చూసింది పెద్ద తోట. క్రోటనులు. మధ్య చిన్నపాలరాతి కృష్ణ విగ్రహం. కొద్దిదూరంలో నాలుగు దిక్కులకి జలయంత్రాలు. ఎడమవేపు పెద్దభవనం. ప్రసాద్‌దిగి లతచేతిని పట్టుకు తీసుకు వెళ్ళాడు. ఎదురుగా వుండే హాలులో సామానుల్లో ఒకటికూడా లత ఎప్పుడూ చూసివుండలేదు. లతని ఒక పెద్ద గదికి తీసుకువెళ్ళి "ఇదే నీ గది. నా గదికి నే వెళ్తా. స్నానం ముగించి భోజనాలహాలు దగ్గరకిరా. ఏమైనా వుంటే భోజనాలయ్యాక మాట్లాడు కుందాం. అని వెళ్ళిపోయాడు.

లతకి ఇదంతా ఏదో మాయలావుంది. కాని బట్టల పెట్టె తెరిచేసరికి దాన్నిండా క్రేపు చీరలున్నాయి. తన చిన్న పెట్టెతీసి అందులోంచి తెల్ల ప్రింటెడు చీరతీసుకుని కట్టుకుంది భోజనాల హాలు దగ్గరకి వెళ్ళింది. పెద్ద టేబిలు. చుట్టూ కుర్చీలు. ఒక ముసలావిడ తెల్లపట్టుచీర కట్టుకుంది. ప్రసాద్ "అలా కూర్చో" అన్నాడు. లతకంతా అయోమయంగా వుంది. "లతా ఈవిడే మా మేనత్త. చిన్నప్పటినుంచి ఇక్కడే వుంటుంది. అని ముసలావిడను చూపాడు. అప్పుడే లోపలికి వస్తున్నది ఒక అమ్మాయి. చాలా నాజూకుగా వుంది. ఎత్తుమడమల జోళ్ళు టక టక లాడించు కుంటూ చేతిసంచి ఆడించు కుంటూ విలాసంగా లోపలికివచ్చింది." ఇది మా పిన్నికూతురు శశిరేఖ" అన్నాడు. "శశి, ఇదేలత. నేనుఅగ్నిసాక్షిగా పెళ్ళి చేసుకున్నాను అన్నాడు. లత నవ్వింది. శశిరేఖ "అలాగా" అంటూ లతచీరకేసి హేళనగా అదోలా చూసింది. "నువ్వుకొన్న చీరేనా ఇద ప్రసాద్"అంది. అంత వరకూ లత చీరకేసి చూడని ప్రసాద్ చీరకేసి చూసాడు అతనికి చిరుకోపం వచ్చినట్లుంది. శశీ వాటినిగూర్చి తరువాత మాట్లాడు కుందాంలే" అన్నాడు.

భోజనాలయ్యాక ప్రసాద్ లత రూములోకి వచ్చాడు. "లతా నువ్వు నన్ను ఒక్క విషయంలో క్షమించాలి. చనిపోయిన జమీందారు మధుమూర్తి గారి అబ్బాయినే నేను. డబ్బుకోసం కాని నా కోసం నన్నెవరూ ప్రేమించరని అనుభవ పూర్వకంగా తెలుసుకొని నా కోసంగా నన్ను ప్రేమించే వ్యక్తికోసర మని మారు వేషంతో మీ వూరువచ్చాను. అదృష్ట వశాత్తు నిన్ను కలసుకున్నాను. ఇకమీదట నువ్వు ఒక జమీందారుగారి భార్యవన్న విషయం గుర్తుంచు కుంటూవుండు నీకు ఏంకావాలన్న పని మనుష్యులున్నారు. "చూడు లతా. ఇంకోమాట. ఇంకమీదట నువ్వు అలాంటి నూలు చీరలు కట్టుకోకు. అంతా వేళాకోళం చేస్తారు. నేను పెద్దసూటుకేసులో పెట్టిన చీరలాంటివే ఇంట్లోకూడ కట్టుకో. కావలసినవాటిని సాయంత్రం బజారుకెళ్ళి కొనుక్కుందాం" అని వెళ్ళిపోయాడు.

లత సాయంత్రం బట్టలు మార్చుకు విజిటర్సుహాలులోకి వచ్చేసరికి శశిరేఖ ప్రసాద్ మేనత్త కూర్చున్నారు. లత ఆ మెరిసే దీపాలవంక ఆ చక్కటి బొమ్మల్ని ఆశ్చర్యంగా చూస్తోంది. "ఈమె ఇవన్నీ ఎప్పుడూ కనివిని ఎరగనట్లుందే." అంది శశిరేఖ. ఎత్తి పొడుపుగా అందో లేక సానుభూతిని ఒలకపోస్తూ అందో తెలియలేదు లతకి "లతా కారెక్కు"

అన్నాడు ప్రసాద్. కారులో కూర్చున్నలతకి ప్రసాద్ మేనత్త మాటలు వినపడ్డాయి. "ఏదో ఇంత వున్న వాళ్ళని చేసుకుంటాడనుక్కున్నానుగాని ఇంత ఏమీ లేనివాళ్ళ పిల్లని కట్టుకుంటాడనుకోలేదు" లతకి తల తీసేసి నట్లయింది. బాధపడింది. అవమానంతో కుంగి పోయింది. తన తండ్రికైతే ఇంతడబ్బు అయితే లేదు గాని అసలు ఏమీ లేనివాళ్లు కాదుగా. వీళ్ళకి వుండే అభిమానం తనకి మాత్రంలేదా, తను మాత్రం వాళ్ళ లాంటి ఆడది కాదా?

లతకి ఆ లంకంత కొంపలో పనే చెయ్యడానికీ లేదు ఇంట్లో బాగాపని అలవాటయిన లతకి రోజులు భారంగా వున్నాయి. ఏమీ తోచక పుస్తకాలు చదువుతూ వుంటుంది. రేడియోలో ప్రోగ్రాములు వింటూంటుంది. లత తను కన్న కలలన్నీ అబద్ధమయి నందుకు విచారంగా వుంది. పెందరాడే లేచి కాఫీ చేసి కథల్లోలాగా మంచంమీద ఇంకా పడుక్కున్న భర్తనులేపి స్వంత చేతులతో భోజనంపెట్టి ఆఫీసుకి పంపాలనీ, ఆఫీసునుంచి వచ్చేసరికి చిరునవ్వుతో పలకరిద్దామనుకున్న లతకి ఇది ఏ మాత్రం నచ్చలేదు. ఈ యింట్లో మనుష్యులకి సాన్నిహిత్యమేలేదు. అంటీ అంటనట్లుంటారు. రాత్రి తొమ్మిదిఅయినా శశిరేఖ ఎందుకురాలేదో ఎవరూ అడగరు.

ఆరాత్రి లత ప్రసాద్‌తో "ఏమండీ నన్నెందుకిలా మోసగించారు" అనడిగింది "నేనా, నే నెవ్వరినీ మోసగించలేందే" "ఏదో మీరు చిన్న ఉద్యోగస్థులంటే నమ్మాను. అంతే కాని ఇంత గొప్పవారని తెలిస్తే"

తెలిస్తే పెళ్ళాడక పోదువా "అన్నాడు ప్రసాద్. అబ్బే అలా కాదనుకోండి నేను మీ అంతస్తుకి తగిన దాన్ని కాదని చెప్పేదాన్ని నాకు ఈ వాతావరణం ఏవీ నచ్చలేదండీ" అంది.

"అలా అంటే ఎలా లతా ఇంక యీయిల్లుచక్కబెట్టుకోవడం అంతా నువ్వేచూడాలి, అధికారం చలాయించడం. నువ్వు ఏపని చెయ్యకుండా నువ్వు లేందే ఆపని జరక్కుండా వుండేటట్లు చూసుకోవాలి. మానాన్న అంటూండేవాడు అమ్మ వుండగా ఇల్లు కళగా వుండేది. కోడలువస్తే అనేవాడు" అన్న ప్రసాద్‌ని చూసి లత ఒక నిశ్చయానికి వచ్చింది.

మర్నాడు పెందరాడే లేచింది. ప్రసాద్ ఇంకా లేవలేదు. వంటింట్లోకి వెళ్ళింది. పాలు అవీ లెక్క తెలుసుకుంది, వంట పురమాయించింది. భోజనానికి వచ్చిన ప్రసాద్ ఆశ్చర్యపోయాడు. అన్నీ తనకిష్టమైనవే "లతా పొరపాటున నువ్వు చెయ్యలేదుకదు" అన్నాడు ఆశ్చర్యంగా "అబ్బే" అంది లత.

"వాళ్ళింట్లో లాగే అనుక్కుని చేసిం దేమో" అంది. శశిరేఖ. లతకి చిరాకేసింది. "గొప్పయినా బీదయినా ఆడదిపని చెయ్యడంలో తప్పు లేదనుకుంటా" లత యింత గట్టిగా మాట్లాడగలదని అనుకోక పోవడంవల్ల శశిరేఖ నిర్ఘాంతపోయింది.

* * *

ప్రసాద్‌పని అడకత్తెరలో పోకచెక్కలా అయింది. ఒక పక్కన లతని తనవాళ్ళు ఎత్తిపొడుస్తూంటారు. ఊరుకునే వాటికి వూరుకుంటుంది ఓర్పుకీ హద్దుంటుంది. కొన్నిటికి జవాబులుచెప్తుంది. లతచేసే పనుల్లో ఆక్షేపణకి అవకాశం వుండదు. అందుకని వాళ్లు లత పుట్టింటి లేమిని ఎత్తిపొడుస్తుంది లతకి తన్నేమైనా అంటే పడుతుందిగాని తండ్రిని అంటేపడదు. వీలయినంతవరకు చిన్న చిన్న తుంపరలేగాని తుఫాను లేవదియ్యలేదు ప్రసాద్‌కి మాత్రం ఇది ఇలాచిలికి చిలికి వానవుతుందేమోభయం. ఆరోజుశశివచ్చి "అన్నాయ్. ఇవాళ మా కాలేజిలో డ్రామా. నువ్వు తప్పక రావాలి" అంది. ప్రసాద్ లతకోసంతోటలోకివెళ్ళాడు. లత గడ్డిలో కూర్చుని గులాబీల వంకచూస్తోంది "లతా ఇలా తోటలో కూర్చుంటే క్రింద తివాసీ మీదేసుకోవాలన్నా" "అబ్బ అవన్నీ అలవాటులేదండీ. వీలయినంతవరకు అన్నీ మార్చుకున్నాగా. ఇంటి మీద ధ్యాసయినపుడు ఇలా కూర్చుంటే హాయిగా వుంటుంది" అంది ప్రసాద్‌కి తను లతని పెళ్ళిగురించి అడిగినదృశ్యం కళ్ళకికట్టింది గున్న మామిడిచెట్లు. మాధవీలతా. అవును మరి వరికన్నెలా స్వేచ్ఛగాపెరిగింది, లత ప్రక్కనే కూర్చుంటూ" "లతా ఇవాళ శశి కాలేజీలో డాన్సుచేస్తుందిట. మనం తప్పక వెళ్ళాలి" అన్నాడు. లత తలూపింది.

సాయంత్రం శశిరేఖ డాన్సుఅయ్యాక లత ప్రక్కన వచ్చి కూర్చుంది. వదినని వదినా అని పిలవడం అలవాటులేదు. బి.ఎస్ సి. చదువుతున్న ఆవిడకి లతస్కూలు ఫైనల్ లెక్కేకాదు. శశిరేఖ పరధ్యానంగా స్టేజికేసి చూస్తోంది. ఇంతట్లో సెక్రెటరీ వచ్చి "ఇప్పుడు ఏం.ఎస్ సి. ఆఖరిసంవత్సరం చదువుతున్న [illegible]

పాడుతారు" అన్నాడు. తెల్లటి పొడుగుమనిషి. తెల్లటి పైజమా సిల్కులాల్చీ వేసుకున్నాడు. చెదరి పోతున్న క్రాపు సరిచేసుకుంటూ పాడుతున్నాడు. లత ప్రసాద్‌కేసిచూసి "మా బావ, పెళ్ళిలో చూసారుగా" అంది. ప్రసాద్ తలూపాడు. శశిరేఖ విశ్వం వేపు నుంచి దృష్టి మరల్చుకోలేకపోయింది. తదేక దీక్షగా చూసింది. ఏదో అనిర్వచనీయమైన ఆనందం పొంది

అంతా అయిపోయాక లత ప్రసాద్ కారెక్కారు. ఇంతట్లోగా శశి వచ్చి "అన్నాయ్ ఇతనే మా ప్రిన్సిపాలు" అంది. ప్రసాద్ నమస్కరించాడు. "మీరు మాకు డబ్బిస్తానన్నారు" అన్నాడాయన "చెక్కు వీల యినపుడు పంపుతా. లత పేరులో ఉండాలి ఆబ్లాకు" అన్నాడు ప్రసాద్ ప్రిన్సిపాలు వెనకనే వచ్చిన విశ్వం లతని చూసాడు. మాట్లాడు దామనుక్కునేలోగానే కారెళ్ళిపోయింది. "మీరు బాగాపాడతారండీ" అన్న మాటలువిని వెనక్కి తిరిగాడు. కోల ముఖం. టిష్యూ చీర, రవ్వలనెక్లెసు. చేతికి వాచీ. ఎవరో పెద్దింటిపిల్ల. కానీ ఏదో అభిమానంతో "మీరు శశిరేఖగారా, మీ డ్యాన్సుకన్నానా నా పాట" అన్నాడు. "పాటలోని మాధుర్యం నాట్యంలో లేదండీ" వద్దనకుండా విన కుండా శశిరేఖ విశ్వాన్ని తన కారులో దింపుతా నంది విశ్వం తన యింటి వీధిమొగలో దిగిపోయాడు

* * *

వారం రోజులు గడిచింది. వారం రోజుల్లోనూ శశిరేఖకి విశ్వం పరిచయం వృద్ధిఅయింది. బాగా చనువుగా వుంటున్నారు.

ఆ రోజు శశిరేఖ పుట్టినరోజు, లత ప్రభావమేమో ఇల్లు కళకళలాడుతోంది. ఎక్కడ చూసినా లతే. అంతా హడావిడి. శశిరేఖ స్నేహితులో పాతిక మంది వచ్చారు. వెనక్కి తిరిగిన ప్రసాద్‌తో శశి "ఈయన విశ్వం ఎమ్. ఎ. సి. చేస్తున్నారు" అంది. అంతస్తుల కోసం ఆశపడే శశిరేఖ స్నేహితుల జాబితాలో విశ్వం వున్నాడంటే ఆశ్చర్యంవేసింది. ప్రసాద్‌కి. విశ్వం ప్రసాద్‌కేసి చూసాడు. ఎక్కడో చూసినట్లుంది. ఫుల్ సూట్లో లైట్ల ముందున్నతను ఆనాడు తమ లతని పెళ్ళాడిన వ్యక్తేనని గుర్తించాడు. ఇంతట్లోగా లత వచ్చింది ఖరీదైన చీరె. మిలమిలా మెరసిపోతోంది. శశిరేఖ ఎవరో స్నేహితురాల్తో వెళ్ళింది. "లతా" "ప్రసాద్. మిమ్మల్ని కాలేజీలో చూసిఫుంటే లతకి ముందరే చెప్పేవాడిని" "అలా అయితే మీ లత నన్ను చేరనిచ్చేదేకాదు" అన్నాడు ప్రసాద్ "లతా నువ్వు చాలా అదృష్ట వంతురాలివి. డబ్బేకాదు గుణంకూడా వుంది ప్రసాద్‌కి"

లత ప్రసాద్‌తో లోపలికి వెళ్ళింది. శశి వచ్చింది "ఏవండీ విశ్వంగారు మీ నాన్నగారి పనేమిటి" అంది. విశ్వంకి ఈ ప్రశ్న చాలా కష్టం కల్గించింది. చిన్నప్పటి నుంచీ తల్లితండ్రి ఎవరో ఎరగడు "నాకు అమ్మా నాన్నాలేరు. మీ భూములున్న వూరి కరణం గారు మా మేనమామ" అన్నాడు. ఇంకా ఏదో అనే లోగానే ప్రసాద్ వచ్చాడు. పార్టి అంతా అయ్యాక అందరు వెళ్ళారు. విశ్వంని శశి కారులో దింపు తానంది ప్రసాదు మేనత్త "ఏరా ప్రసాదు, రేఖ స్నేహితులకి ఇది ఎవరి పిల్ల అని చెప్పావురా" అంది. "చెప్పాల్సిన అవసరంలేదు" అన్నాడు ముభావంగా. "ఏమోలే. చెప్పావేమో. శశికి చిన్నతనంగా వుంటుంది. ఇప్పుడు ఇక్కడకొచ్చిన వాళ్ళంతాలక్షాధి కారుల పిల్లలే" లత వుండబట్టలేరక "ఇందులో ఎవరూ ఐశ్వర్యంతో పుట్టలేదండీ, అందరూ తల్లికి పుట్టినవారే" అంది. విశ్వం శశిరేఖకేసి చూసాడు. లతకోసం బాధపడుతోందేమోనని బాధ గాదుగాని నిర్లక్ష్యం స్పష్టంగా కన్పడుతోంది దాన్నిబట్టి లతని శశి ఏమీ అడిగివుండదని గ్రహించాడు.

కారులో కూర్చున్నాక శశిరేఖ "ఏవండీ అదోలా వున్నారు. "అంది. అహ, మీ అత్త అన్నట్లు అక్కడికి వచ్చిన వాళ్ళందరూ లక్షాధికారులేనా" అన్నాడు. "అవును అంది. మీరు డబ్బున్న వాళ్ళతో కాని స్నేహం చెయరా" అన్నాడు. శశిరేఖ జవాబియ్య లేదు. శశిరేఖని ఇన్నాళ్ళనుంచి ఎవ్వరూ ఇలాంటి ప్రశ్న అడగలేదు. శశిరేఖకీ ఈ ప్రశ్న కలగలేదు.

"ఏవండీ జవాబియ్యనందువల్ల తప్పించుకోనేరరు. ఈనాటి నుంచి మీరు నన్ను పలకరించవద్దని కోరు తున్నాను. మీరు కోరుతున్న లక్షలైతే లేదుకాని లక్ష్యాలకీ ఆదర్శాలకీ • లోటులేదు అనుకుంటా అన్నాడు. శశిరేఖతెల్లబోయింది. విశ్వంని విశ్వంగానే ఆలోచించింది. కానీ అతని ఆస్థిపాస్థులను గురించి ఇంతవరకూ ఆలోచించలేదు. ఇంతవరకు ఆమె డబ్బుకి ప్రాముఖ్యం ఇచ్చిందేమో కానీ ఆమెకి దాని మీద ధ్యాసలేదు. కారుస్టీరింగుమీద చేతులుందో కాని

ఆమెకి చాలాబాధగావుంది. ప్రసాదుకి శశిరేఖ చెల్లెలే కాని గుణాల్లో కాదనిపించింది విశ్వంకి. ఇగ్నిషన్‌కీ ఆపుచేసి, కారుతలుపు తెరచి "శశిరేఖగారు. మీరు ఎప్పుడయితే లక్ష్యాలకి విలువిస్తారో అప్పుడు మళ్ళీ నన్ను కలుసుకోండురుగాని" ఇంట్లో కూడా మీ వదినని వదినా అని పిలవడం నేర్చుకోండి "అని తలుపు వేసేశాడు. శశిరేఖ హృదయం బాధగా మూల్గింది. సాధారణంగా విశ్వంని తలుచుకుంటే మనస్సుకి ఏదో అన్పించేది. ఏదో విధమైన అనుభూతి కల్గేది. అలాంటి హృదయాన్నే ఇవాళ కెలికి పారేసాడు. అర్ధంకాని ఆవేదన, స్టీరింగుమీద తల ఆన్చి చేతులలో ముఖం కప్పుకు ఏడ్చింది."

* * *

వారం రోజులుగా విశ్వం ల్యాబ్‌చుట్టూరా తిరిగింది శశి. కానీ విశ్వం తప్పించుకు తిరిగాడు. అన్నాళ్ళకి శశిరేఖకి డబ్బుకంటె విలువైనది హృదయం అని తెల్సింది. కానీ ఆమె ప్రకారం అది మరీ ఆలస్యంగా తెల్సింది. విశ్వంకోసం కబురంపుతే రాలేదు. దుఃఖం పట్టనేరక ఇంటి కొచ్చేసింది. రేడియోగదిలో సోఫాలో కళ్ళుమూసుకు కూర్చుంది. ఆపక్కనుంచి వెళ్తున్న లత ఏడుస్తున్న శశిని చూసింది ఎప్పుడూ చలాకీగా గర్వంగా తిరిగే శశి ఏడవటం ఏమిటి. పుట్టినరోజు పండుగనుంచి అదోలావుంది. ప్రసాదు దగ్గరకెళ్ళి "ఏవండీ. మీ చెల్లెలు ఆ పండుగ రోజునుంచి అదోలావుంది" "ఏంనీకు బాధగావుందా" అన్నాడు ప్రసాదు. "కాదుటండీ మరి నవ్వుతూ నవ్విస్తుండే పిల్ల ఏడుస్తూంటే" ప్రసాదు శశి దగ్గరికి వెళ్ళాడు. డబ్బున్న వాళ్ళతో కాని స్నేహం చెయ్యని రేఖ విశ్వంని తీసుకొచ్చింది. స్వయంగా కార్లో దిగ బెట్టింది. ఆలోచించిన లతకి సమాధానం దొరికింది. శశి విశ్వాన్ని ప్రేమిస్తోందా? మనిషి మనసూ. ప్రసాదు బయటకి వచ్చాడు నేను చూడాలంటున్నా నని విశ్వాన్ని రమ్మనండి" అంది లత. ప్రసాదు ఆశ్చ ర్యంగా చూసాడు "సాయంత్రం వస్తానన్నాడు" అంటూ ఫోనుపెట్టేశాడు, లత శశిరేఖ దగ్గరకెళ్ళింది "శశీ" శశిరేఖ తలెత్తింది. ఇంటి దగ్గర కూడా మీ వదినని వదినా అనిపిలవడం నేర్చుకోండి" అన్న మాటలే విన్పించాయి. అప్రయత్నంగా "వదినా" అంది. లత నివ్వెరపోయింది. తమాయించుకుని "విశ్వం సాయంత్రం వస్తానన్నాడు" లేచి ముఖం కడుక్కో" అంది లతకి విశ్వం ఎలా తెలుసు విశ్వం కోసరమే తను బాధపడుతోందని ఎలాతెలుసు "వదినా నేనేం విశ్వంకోసం ఏడవటంలేదు" అంది అభిమానంతో. "అలా అనినేనన్నానా"

సాయంత్రం సింపులుగా తెల్లచీర తెల్లజాకెట్టు వేసు కుని మల్లెపూలతో శశిరేఖ మెట్లు దిగుతోంది. లత విశ్వాన్ని "బావా టిఫిను తింటావా?" అంటోంది. అయితే లతకి విశ్వం బావన్నమాట. శశిరేఖకి విశ్వం వున్న గదిలోకి వెళ్ళడానికి ధైర్యం చాలలేదు. తట పటాయిస్తూ గుమ్మందగ్గరే నిలబడింది "శశీ రామ్మా" అంది లత. అన్నయ్యే చేత ముందే ఆలోచించి పిలి పించింది అన్నమాట అనుకున్నాడు విశ్వం గది లోంచి వెళ్ళిపోయాడు "వదినా" అన్నమాట విని ఆశ్చర్యపోయాడు. లతకి పరిస్థితి పూర్తిగా అర్థ మయింది "శశి వెనకాలే వెళ్లు బావ మనసు మెత్త నిది'' అంది లత. శశి అనుమానిస్తూనే వెళ్ళింది విశ్వం అప్పుడే పోర్టికో దాటాడు, పాలరాతి కృష్ణుడి దగ్గరుండగా "విశ్వంగారూ'' అన్నపిలుపుతో కాళ్ళకి బంధాలుపడ్డాయి. తలెత్తాడు. ఎప్పుడూ ఖరీదైన బట్టల్లో వుండే శశి తెల్లచీరలో వుంది.

''మీకు నాతో ఏంపని" అన్నాడు ముభావంగా

"ఏం మాట్లాడాలి" అనాడు విశ్వం

"ఏవండీ నన్నిలా భాద పెడతారెందుకండీ" అంది ఏడుస్తూ.

"మిమ్మల్ని నేనేం భాధపెట్టడంలేదండీ. అంతస్తులు కావలసిన వాళ్ళకి మనుష్యులు అర్ధంకారు"అన్నాడు.

"మీవల్ల నేను అంతస్తుల సంగతి మర్చిపోయాను నాక్కావలసింది మనిషి, మనసూ" అంది ఆవేశంతో.

"అయితే మీరు నిశ్చలంగా ఈ డాంభీకాలన్నీ వదిలి రాగలరా" అన్నాడు ''నిశ్చయంగా" అంది అయితే ప్రసాద్‌తో చెప్దాం "అన్నాడు, ఇద్దరూ లోపలికి వెళ్ళారు. లత "ఏవండీ. నూతన వధూవరు లని ఆశీర్వదించండి" అంది. ''నీకు తెలీని విషయాలు లేవేమో" అని ''చూసావా శశీ లతే నీవిషయం కనుక్కుంది'' అన్నాడు ప్రసాద్. శశిరేఖ ఆనందంతో ఆశ్చర్యంతో లత కాళ్ళకి వంగి నమస్కరించింది ''వదిన నన్ను క్షమించి ఆశీర్వదించు'' అంది కన్నీ ళ్ళతో. "బావా ఏడు రోజులయింది శశి భోంచేసి. ఇంకమీదట ఇలాచేసావో చూడు" అంది.

ప్రసాదు అందుకని "అయితే నీ మనస్సు కరగలేదటయ్యా" అన్నాడు.

"ఏమీలేదు. మనుష్యుల విలవలు గుర్తించేందుకే నేనలా చెయ్యాల్సివచ్చింది. మనుష్యుల విలువలు గుర్తించపోతే ఇప్పటికేకాదు ఎప్పటికి మాట్లాడేవాడినికాదు ఇప్పుడీవిడ లక్షలనే కాదు లక్ష్యాన్నికూడా సంపాదించుకొంది" అన్నాడు విశ్వం.

"ఏదోఅంతానీవల్లనే అనుకుంటూన్నావుకాబోలు. లతేలేకపోతే" అన్నాడు ప్రసాద్ "అవునుఅదినిజం" అని శశి విశ్వం ఇద్దరూ ఒక్కమాటే అన్నారు.

"నాదేముంది" అని లత ప్రసాదుకేసి చూసింది. అప్పుడే వచ్చిన ప్రసాద్ మేనత్తకి నల్గురూ నమస్కరించారు. ఆవిడ ముందర ఆశ్చర్యపోయినా శశి మీద మమతకొద్ది "అమ్మాలతా ముహూర్తనిశ్చయంచెయ్యి" "పెద్దవారు మీరుండగా" అన్న లతని చూసి అందరూ గర్వపడ్డారు. లత ప్రసాద్ అనిర్వచనీయమైన ఆనందంపొందారు.

---

# చిన్న పిల్లలలో అజీర్తి

"మా చంటి పిల్లవానికి పండ్లు వస్తున్నవి. ఏడు వారాలనుండి అజీర్తి పట్టుకున్నది. ఎన్ని ప్రయత్నములు చేసినా లాభంకనబడుటలేదు. మీసలహాఏమి?"

చిన్నపిల్లలు అజీర్తితో బాధపడుట అతి సామాన్యమైన విషయం. ఈవ్యాధిని కలుగజేయు కారణాలు అనేకం. చికిత్స ప్రారంభించక ముందు ఏకారణము వల్ల అజీర్తి ప్రారంభించిందీ నిర్ణయించబడవలెను. మలమును పరీక్షించి, అందు బాక్టీరియాగాని, పురుగులు గాని, లేక జీర్ణముకాని ఆహారంగాని వున్నదేమో తెలిసికొనాలి. ఈవిషయాలు తెలిసికున్న తర్వాత చికిత్స సులభం. అంతేగాని అందరువైద్యుల సలహానుసరించి అన్ని రకాల మందులు ప్రయత్నించుట మంచిపద్ధతి కానేకాదు.

చికిత్సలో మొదటి మెట్టు ప్రేవులను శుభ్రపరచుట. తర్వాత పథ్యం పెట్టుట. తీపి కలిపిన పాలు ఇవ్వకూడదు. పెరుగు గాని, పులుపుగాని ఇవ్వ వచ్చును పాలల్లో లాక్టిక్ ఏసిడ్ కలిపి ఇవ్వవచ్చును. ఎంత మొండి అజీర్తి రోగమైనా పథ్యముచే లొంగిపోవును.

ప్రకోపము పెద్దప్రేవులో వున్నదనుకుంటే పిండి నీటితో ఎనీమా ఇచ్చి, పొత్తికడుపుపై వేడికాపడములు పెట్టినప్పుడు కొందరు బాగుపడ్డారు. పిండి నీరు చేయు పద్ధతి : ఒక సేరు నీటిలో, ఒక గరిటెడు మొక్కజొన్న పిండిని కలిపి పొంగించి పలుచని గంజి నీటివలె తయారుచేయాలి.

మామూలు పిండి పదార్థాల కంటె డెక్స్ట్రిన్ కలిపిన కార్బోహైడ్రేటులు ఇవ్వవచ్చును. పండ్లువస్తున్న చంటి బిడ్డ వైఖరిలో కొంతమార్పు వుంటుంది. ఆదైనా స్వల్ప కాలం వరకే. అయినా, బిడ్డయొక్క అజీర్తికి కేవలం ఇదే కారణ మనడానికి వీల్లేదు. చిన్నపిల్లల వ్యాధుల్లో అనుభవం గల వైద్యుని సంప్రదించండి

('ఇండియన్ మెడిసన్' —మాస పత్రిక నుండి)

# ఒకనాటి శ్రామికవనిత నేటి మహాలక్ష్మి

1945లో ద్వితీయ ప్రపంచ సంగ్రామం ఆఖరయిన తర్వాత, కొన్ని సంవత్సరాలపాటు, రాజధానీ నగరం బెర్లిన్‌లోనూ, యితర నగరాలలోనూకూడా, జర్మన్ వనితలు ముతక బట్టలు ధరించి బరువైన జోళ్లతో, నేలకూలిన భవనాలనుంచి యిటుకలు గృహాశిధిలాలు సేకరించి, రోడ్లు ఖాళీచేసి పునర్నిర్మాణ కార్యక్రమాలకి నడుంకట్టి పనిచేయడం, అందరికీ తెల్సినవిషయమే. అనేక వృత్తి వుద్యోగాలకీ వేరువేరు సాంఘిక వర్గాలకీ చెందినవారు, జాతిమత వ్యత్యాసాలు లేకుండా, వయోభేదాలు పాటించకుండా, చిన్న, పెద్ద అన్న యోచన లేకుండా నడుంకట్టి, సర్వనాశనమై నేల కూలిన తమ నగరాల పునరుద్ధరణకి పాటుపడ్డారు. బెర్లిన్ నగరంలో, ఆనాటి "శ్రామికవనిత" దేశపు క్లిష్టాతిక్లిష్టమైన సమయంలో, ఆకలి దప్పులకి లెక్క చేయకుండా నలికీ వానకీ చలించకుండా, -యుద్ధానికి వెళ్లిన అన్న, తమ్ముడు, తండ్రి, భర్త తిరిగి రాలేదని గాని రాబోరనిగాని విచారించకుండా, స్వచ్ఛందంగా కృత నిశ్చయంతో చేసిన అఖండ సేవని శ్లాఘిస్తూ కృతజ్ఞతాసూచకంగా బెర్లిన్ నగరవాసులు నేడు నిర్మించిన స్మారక చిహ్నాన్ని చూస్తే, హృదయం అర్ద్రంకానివారుండరు. కష్టపూరితమైన ఆ యుద్ధపు రోజుల ఫలితంగానూ, యుద్ధానంతర పరిస్థితుల ఫలితం గానూ, నేటి జర్మన్ వనిత యూరప్‌లోని ఆధునిక మహిళలలో అగ్రగామిగా రూపొందింది. అదీకాక యూరప్‌లో చాల సంవత్సరాలుగా అద్భుతమైన మానసిక పరివర్తన జరుగుతూనే వచ్చింది. దీనివల్ల యూరప్ అంతటిలోనూ భార్యా భర్తల మధ్యనూ, కుటుంబ పరిస్థితులలోనూ కొన్ని మార్పులు సంభవించాయి. "కుటుంబపెద్ద, అతని యజమాన్యం" అన్న భావం స్థానే కుటుంబంలో సహభాగత్వం అన్న భావం ఉద్భవించింది. ఈ పరిణామం యింకా పూర్తికాలేదు. ఇంకా సాంఘిక పరిస్థితులు పరిణామావస్థలోనే ఉండడంవల్ల యీమార్పు మహిళలకి లాభదాయకమైనదా? కాదా? అన్న ప్రశ్నకి సమాధానం చెప్పడం ప్రస్తుతం కష్టం. కాని ఒక్కవిషయం మాత్రం తథ్యంగా కనపడుతోంది. నేటి జర్మన్ వనిత, అనాదిగా స్త్రీలకి సుగుణాలుగా నిర్వచించిన కర్తవ్యాలు, అనగా పిల్లల కనడం. గృహ నిర్వహణ, దైవారాధన అన్నవాటికన్న భిన్నమైన బాధ్యతలని కర్తవ్యాలనీ స్వీకరిస్తోంది. ఈ నూతన బాధ్యతలవల్ల, జర్మన్ వనిత రోజురోజు, ఇంతవరకూ పురుషుల కర్తవ్యాలుగా పరిగణింపబడిన రంగాలలోనికి ప్రవేశించడం జరుగుతోంది.

జర్మన్ మహిళలు 1919 వ సంవత్సరంలోనే రాజకీయ హక్కులు గడించుకున్నారు. ఆనాటినుంచీ వారు రాజకీయ రంగంలో ముందంజ వేయడానికి కృషి చేస్తున్నారు. నేటి ఫెడరల్ జర్మన్ పార్లమెంటు క్రింది సభలో పదవ వంతు సభ్యులు స్త్రీలు. ఉద్యోగాలలోనూ, పౌరపరిపాలనా శాఖలలోనూ ప్రతీ వంద మందికీ ఒక మహిళ పనిచేస్తోంది. జర్మనీలో జరిగిన కడచిన ఎన్నికలలో వోటర్లలో, మగవారికన్న ఆడవారి సంఖ్య 33 లక్షల వరకూ ఎక్కువగా వుంది. ద్వితీయ ప్రపంచసంగ్రామంలో జర్మనీలో పురుషులు అసంఖ్యాకంగా మరణించడంవల్ల దేశంలో ఆడవారి సంఖ్య ఎక్కువ అయింది. అనేక ముఖ్యమైన ఉద్యోగాలు వారు నిర్వహించవల్సి వచ్చింది.

నేటి పారిశ్రామిక వ్యవస్థలలో నూరింట ఇరవయి వంతులూ, విశ్వవిద్యాలయాలలో అధ్యాపకులలో నూరింట ఎనిమిదివంతులూ, శాస్త్రోపాధ్యాయులలోనూ, ఉన్నత పాఠశాలలలోని ఉపాధ్యాయులలోనూ, నూరింట ఇరవయి ఏడువంతులూ, ఉద్యోగాలు జర్మనీలో మహిళలే నిర్వర్తిస్తున్నారు. జర్మనీలో అన్నిరకాల వృత్తి వుద్యోగాలని స్త్రీలు నిర్వహించడానికి వీలుంది.

దీనివల్ల నేటి జర్మన్‌వనిత గృహలక్ష్మిగా భర్తకి చేదోడు వాదోడుగా కుటుంబానికి ఆర్థిక సహాయం చేయగల భార్యగా రూపొందింది. ఇంట్లో ఎన్నో ఖరీదయిన ఉపయోగకరమయిన శాశ్వతమైన వస్తువులని తన ఆర్జనవల్ల కొని, ఇల్లు సౌఖ్యప్రదంగా చేయడానికి భర్తకి తోడ్పడుతోంది. ఫేక్టరీలలో, కార్యాలయాలలో, తంతి తపాలా శాఖలలో, రైల్వేలలో అన్నిటిలోనూకూడా జర్మన్ స్త్రీలు పని చేస్తున్నారు.

కడచిన యుద్ధ ఫలితంగా 30 లక్షలమంది పురుషులు మరణించారు. లక్షలాదిమంది యుద్ధ ఖయిదీల శిబిరాలలోనూ, ఆస్పత్రులలోనూ ఉండిపోయారు. నేటికికూడా, జర్మనీలో మూడు లక్షలమంది స్త్రీలకి తమ భర్తలేమయారో ఇదమిత్థంగా తెలియదు. వారిని గురించి యింకా ఏదయినా కబురు వస్తుందేమోనని వారు ఎదురు చూస్తున్నారు. నాలుగు లక్షలమంది భర్తవిహీనలు 'పెన్షనులు' తీసుకుంటున్నారు.

దుర్భరమైన ఆ పరిస్థితులు మరిచిపోవడానికి కొంత కాలం పడుతుంది. కాగా యీలోగా జర్మనీలో అద్భుత పునరుద్ధరణ ఫలితంగా ఏర్పడిన పూర్తి ఉపాధి అవకాశాలని జర్మన్ వనితలు పూర్తిగా వినియోగ పర్చుకున్నారు. జర్మనీలో స్త్రీలు పెద్ద యంత్రాలనీ, సామాన్లు నౌకలలోవేసే 'క్రేన్'లనీ సహితం నడుపుతున్నారు.

ఇంచుమించు రెండులక్షల మంది జర్మన్ భార్యలు ఉద్యోగాలవల్ల భర్తలకి సహాయం చేయగల్గుతున్నారు. వీరిలో సగంమంది మహిళలు పనులు చేయడంవల్ల, యీ నూతన పరిణామాలవల్ల, జర్మనీలో భార్యాభర్తల మధ్యగల సంబంధ బాంధవ్యాలలోగాని, వారి నైతిక ప్రవర్తనలోగాని, కుటుంబ సాంప్రదాయాలలోగాని ప్రతికూలమైన ప్రభావం ఏదీ కనపడలేదు. నిజానికి పరిణామాలు అనుకూలంగానే ఉన్నాయని చెప్పవచ్చు. కాగా సంఘంలో అనాదిగా వస్తున్న పురుషుని అధికారం మాత్రం గట్టిదెబ్బ తింటనే చెప్పాలి. నేటి జర్మన్ వనిత గృహిణిగా మాత్రమే ఉండడానికి సంతుష్టి పడడంలేదు. తనవృత్తి వుద్యోగాలకీ కుటుంబ జీవితానికీ సమాన ప్రాధాన్యం యిచ్చి తన శక్తి సామర్ధ్యాలు కనపరుస్తోంది. విశ్రాంతి సమయంలో ఆనంద వినోదాలకి కుటుంబాన్ని ఎంత ప్రేమిస్తోందో తన ఉద్యోగాన్నికూడా అంత అభిమానంతో నిర్వహిస్తోంది. అందుచేతనే జర్మన్ మహిళలు ఒకరిద్దరు పిల్లలకన్న ఎక్కువవుండకుండా కుటుంబనియంత్రణా పద్ధతులు అనుసరిస్తున్నారు. ప్రతి ముగ్గురు దంపతులలో ఒకరికి పిల్లలే ఉండరు. జర్మన్ ఆర్థికవ్యవస్థే మూడింట వకవంతువరకూ మహిళలచే నిర్వహించ బడుతోంది.

దీనివల్ల వీరికి అనుగుణ్యమైన సాంఘిక సంక్షేమ సౌకర్యాలు ఏర్పాటు చేస్తున్నారు. అర రోజుపని, పగటిపూటే పాఠశాలలు మొదలయిన అవకాశాలు కల్పచేస్తున్నారు. కాగా అన్నింటికన్న ప్రధానమైన విషయం ఒకటి పరిష్కరించవల్సివుంది. స్వర్గతుల్యమైన తల్లిప్రేమ, కుటుంబ జీవితంలోగల మాధుర్యం, ఆనందమైన పరిస్థితులు, జర్మన్ పసిపాపలకి చవి చూపించడం ఎలాగ అన్నదే యీ సమస్య.

—"శశికళా"

బాలవినోదం :

# సరోజినీదేవి

ఓ చిట్టిచెల్లి! నీ కొకతల్లి కతను
చెప్పద వినవమ్మ, చెవులొగ్గి. ఆమె
ఎవరకొన్నావో?- ఈ దేశమునకె
పేరుదెచ్చిన చాలపెద్దవారింటి
బిడ్డ,- ఆమెకు సాటి పిల్లలే లేరు ॥
ఇది చరిత్రము, కతయే కాదు సుమ్మ!
ఆంధ్రులనగర మా 'హైదరాబాదు'
పట్నాన. బ్రాహ్మణ వంశాన గలదు,
అల "చటోపాధ్యాయు"- లనువారి కులము
అందు పండితుడు మహాజ్ఞాని, మంచి ॥
గుణములు గలవా "డఘోరనాథుండు"
విజ్ఞానశాస్త్రాన విద్యాభివృద్ధి
చేయు చాతడు నుండె జీవితమెల్ల
అతనియిల్లాలు కవిత చెప్పగలదు
బెంగాలిభాషలో పెక్కుపద్యాలు ॥
వ్రాసి మిక్కిలి వన్నెవాసిని గాంచె
ఆ జంటకు సరోజినినగ ముచ్చటగ
ముద్దులకూతురు పుట్టె- ఆబిడ్డను
కన్నవార్ సాకిరి గారాబముగను
అందాలబరిణి, పసందులరాణి ॥
తళుకు మెఱుపుతీగ, కులుకు రాయంచ
చదువుల శారద- శ్రద్ధతో ఆమె,
మెల్లగ మద్రాసు మెట్రిక్పరీక్ష
పండ్రెండవేటనే వడిగముగించి,
పదునైదు యేండ్లపు పడసి ప్రభుత్వ ॥
విద్యార్థిభరణంబు వేగ- ఇంగ్లండు
కామె వెళ్ళెను; లండనందు కేంబ్రిడ్జి
యందు తెరపిలేక- ఆ విద్యలెల్ల
చదువుట, ఆరోగ్యసంపద చెడియె.
గాసి మేనికి చాలగలిగె ఆయమకు ॥

(సశేషం)

కౌశిక.

# కీ॥ శే॥ కుందూరి అనసూయగారు



సుప్రసిద్ధ పత్రికారచయిత శ్రీ కుందూరి ఈశ్వర దత్తు గారి సతీమణి శ్రీమతి అనసూయగారు, ఇటీవల న్యూఢిల్లీలో కరోల్ బాగ్‌లోని వారి గృహంలో కాలధర్మం చెందారు. ఈమె వయస్సు 55 సంవత్సరాలు. వీరికి కె. వి. గోపాలరత్నం, సైనికసమాచార్ సహాయ సంపాదకుడు; కుమార్తె శ్రీమతి త్రివేణీ గోపాలకృష్ణశాస్త్రి; మనుమలు, మనుమరాళ్ళు వున్నారు.

ఈ దుఃఖవార్త వినగానే భారత ఉపాధ్యక్షులు శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణన్, సుప్రీంకోర్టు న్యాయమూర్తి శ్రీ కోకా సుబ్బారావుగారు, వారి సతీమణి, శ్రీ తెన్నేటి విశ్వనాధం, రక్షణశాఖ ఉపమంత్రి శ్రీ కొత్త రఘురామయ్య, ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ వర్క్సుమంత్రి అల్లూరి సత్యనారాయణరాజు, మున్నగు ప్రముఖులు శ్రీ ఈశ్వర్వదత్తు ఇంటికి వచ్చి తమసంతాపాన్ని తెలియజేశారు.

శ్రీ సి. రాజగోపాలాచారి (రాజాజీ), లోక్‌సభస్పీకరు మాడభూషి అనంతశయనం అయ్యంగార్, శ్రీ బి. జగన్నాథదాసు, కేంద్ర విద్యాశాఖమంత్రి డాక్టర్ కె. ఎల్. శ్రీమాలీ, సర్ విజయ, స్వరాజ్యసంపాదకులు; శ్రీ ఖాసా సుబ్బారావు, నేషనల్ హెరాల్డ్ సంపాదకులు ఎం. చలపతిరావు, ఆంధ్రజ్యోతి సంపాదకులు శ్రీ నార్లవెంకటేశ్వరరావుగార్లు, తమ సానుభూతిని ప్రకటిస్తూ, సందేశాలను పంపించారు.

"తన భర్త చేతిలో సుమంగళిగా వెళ్ళిపోవడంకంటే హిందూస్త్రీకి కావలసిందేమిటి?–ఆమె ధన్యురాలు" అని రాజాజీ తమ సందేశంలో తెలియజేశారు.

"ఇంటికి వచ్చిన అతిథుల యెడల ఆమె చూపే అప్యాయత ఎన్నటికీ మరువరానిది" అని శ్రీ ఖాసా సుబ్బారావుగారు అన్నారు. శ్రీమతి అనసూయ విద్యాభ్యాసం కాగానే రాజమండ్రీలో వీరేశలింగం బాలికాపాఠశాలలో ఉపాధ్యాయినిగా పనిచేశారు. సహాయార్థులై తమ యింటికి వచ్చిన అనేక మందికి ఎన్నో విధాలుగా తోడ్పడిన ఆదర్శగృహిణి ఈమె ఆత్మకు శాంతి చేకూరుగాక

# అసమర్థుని ఆలోచనలు

శ్రీమతి పద్మావతీ గంగాధర్

త్రుళ్ళుకొంటే హృదయం తరుక్కుపోతుంది. అవురుమని ఏడ్వాలనిపిస్తుంది. అలా క్రుళ్ళి, క్రుళ్ళి, ఏడ్చే కంటె, అవురుమని ఎడిస్తే, హృదయం తేలిక పడుతుందంటారు పెద్దలు. ఆరు నెలలనుండి, గీసి, గీసి, సంసారపు ఖర్చులు తగ్గించుకొని, తిని, తినకుండా, అభం, శుభం, పాపం, పుణ్యం ఎరుగని పిల్లల కడుపులుమాడ్చి, గగ్గోలుగా వాళ్ళు ఏడుస్తూన్నా, కన్న మమకారంకూడ మర్చిపోయి, కొట్టి, తిట్టి, ప్రోగుచేసిన వంద రూపాయలు-క్రొత్త కాగితం, నాల్గు మడతలు పెట్టి ముందరి జేబులో పెట్టుకొన్నా. సంవత్సరంనాడు అప్పుగా పుచ్చుకొన్న, అప్పు తీర్చటానికి దాచిపెట్టిన వంద రూపాయల కాగితం. బయటకు వస్తూండగా "జాగ్రత్తండి, ముందరి జేబులో పెట్టుకొన్నారు...సిటీ బస్సు ప్రయాణం" అని లక్ష్మి అన్నది కూడాను. జేబులో పెట్టుకొనేటప్పుడే, ఎందుకనోగాని "యీ వందరూపాయలు పోతేనో" అనిపించింది. ఎందుకలా అనిపించిందో? జాగ్రత్తగా ఉంటుందనే, నాల్గు మడతలుపెట్టి, ముందర జేబులో పెట్టుకొన్నా. బస్సు ఎక్కా. బస్సు దిగా. స్నేహితుని వద్దకు వెళ్ళా, చాలకాలం అయింది రామూ, నిన్ను చూడటానికే సిగ్గుగా ఉంది. చెప్పినట్లుగా ఇవ్వలేక పోయాను....". అంటూ జేబులో చేయిపెట్టా — ఏముంది? వెతికి, వెతికి చూశా. గుండె ఆగిపోయినంతపని జరిగింది తెల్లముఖం వేశా. జేబు తిరుగ తీసికూడ చూశా శూన్యం. అవురుమని ఏడ్వక చేసేదేముంది.

స్నేహితుడు ఏమంటున్నదికూడ వినకుండా, త్రోవలో ఎచ్చటైన బస్సుదిగి వస్తుండగా పడిందేమోనని, ఆశ, నిరాశలతో, త్రాగుబోతు మోస్తరు తూలుతూ బయలుదేరాను. అరగంట మండుటెండలో టాక్సీలో వెళ్ళితే అర్థరూపాయి పైగా అవుతుంది, బస్సులో వెళ్ళితే ఏడు నయాపైసలతో, పోతుందని లెక్కవేసి, బస్సు కొరకు ఎదురుచూస్తూ నిల్చున్నందుకు ఫలితం. నడచి వెళ్ళినా పోయేది. ఇలా జరుగాల్సి ఉంది. జీవితం అంతేనేమో! ఈలా ఎదో, ఆశలతో, కోరికలతో, ఊహలతో. అనుకొంటూటే, చివరకు ఏదో, మరొకటి తలంచనిది, ఊహించనిది, జరుగుతుంది. ఈ ప్రపంచంలో ప్రాణం ఎప్పుడు పోతుందో తెల్సుకోవచ్చుగాని, జేబులో డబ్బు ఎలా పోతుందో, ఎప్పుడు పోతుందో, తెల్సుకోవటం కష్టం అనుకొంటా. ఈ మహా పట్టణంలో, భారీ ఎత్తున జరిగే వ్యాపారాలలో, జేబులు కొట్టటం అనేదికూడ ఒక ఘన వ్యాపారం అని యిప్పుడే అనుభవ పూర్వకంగా తెల్సుకొన్నా. అన్నిటికన్నా, అవమానకరమైనది, భరించలేనిది — నా స్నేహితుడు నేను అలా నాటకం ఆడాననుకొంటాడేమో! డబ్బు విరోధం తెస్తుందంటారు.

ఇంకా పదిరోజులకు స్కూళ్ళు తెరుస్తారు. పిల్లలకు జీతాలు కట్టాలి. పుస్తకాలు కొనాలి. బట్టలు లేవు. ఏమి చెయ్యాలి? అంతా నా ఖర్మ. దేనికయినా అదృష్టం ఉండాలంటారు. డ్రైవరుకు, కండక్టరుకు దయపుడితే, బస్సుకు అభ్యంతరం లేకపోతే, వయ్యారంగా, ఆ సిటీ బస్సు వస్తుంది. నాలాంటి లెక్కగాళ్ళంతా, త్రొక్కుకుంటూ, తోసుకుంటూ, జీవిత పోరాటంలో ముందుండాలను కొంటున్నట్లుగా ఆ బస్సులో ఎక్కుతారు. ఇంతకు ముందువరకు నేనొక్కడినే దరిద్రుడ ననుకొంటూ ఉండేవాణ్ణి, నా వంద రూపాయల కాసించిన గర్భ దరిద్రుడింకొకడు ఉన్నాడని తెల్సినప్పుడు, కొంతవరకు మనస్సుకు ఊరట కలిగింది.

నాకు ఇప్పుడు 30 సంవత్సరాల ప్రాయం. 'జీవితంలో ఏ క్షణమైనా సుఖపడ్డానా?' అని అనుకొన్నప్పుడు నాకే ఆశ్చర్యం అవుతుంది. క్షణిక సుఖంకోసం, మానవుడు జీవితమంతా, అంగలారుస్తాడు. నానా తంటాలు పడతాడు, ఒకనాడు ఆ క్షణిక సుఖం ఎలా ఉంటుందో తెలియకుండానే శాశ్వితంగా ఈ లోకంనుంచి సెలవు తీసుకొంటాడు. పుట్టిననాటినుండి నా బ్రతుకూ అలాగే ఉంది అంత, ఆనాడూ కూటికీ, గుడ్డకు వాచిపోయాను, అనేక కష్టాలుపడి, కూలీనాలీ చేసి, పస్తులుకూడ చేశాను. అమ్మా, నాన్న నన్ను నాతోబుట్టువుల్ని పెంచారు. కొద్దో గొప్పో చదువుకూడా చెప్పించారు, అంత సంసారాన్ని వాళ్ళు ఎలా యీదగల్గారోనని వింతపడేవాణ్ణి. నా చిన్నతనం నుండి జరిగిన ప్రతివిషయం, నాకు చాలా బాగా గుర్తుంది ఆ రోజుల్లో ఒక రూపాయిపెడ్తే పెద్ద దుకాణమే పూర్తిగా కొనివేయవచ్చు ననుకొనేవాణ్ణి. ఒక వస్తువు అందుబాటులో లేనప్పుడు దాని విలువ పెరిగిపోతుంది. మా నాన్న నన్ను ఎప్పుడైనా బట్టల కొట్టుకు తీసుకెళ్ళినప్పుడు, నాకు ఏది బాగుంటుందా అని గాక, ఏది చవుకగా వస్తుందా అని ఆలోచించేవాణ్ణి. ఆ దినాలలో ఏ రకం బట్ట అయినా గజం, 0-2-6 ఖరీదుకు మించి ఉండేదికాదు ఆవే నా

జట్టలు. వంటిమీద ఒక జత, బండమీద ఒక జత, ఆయిన వాళ్ళుకూడ, వాళ్ళ పిల్లలు చెడిపోతారని మాతో చేరనిచ్చేవారుగారు, కొంతవరకు ఆ రోజులే నాకు ప్రశాంతంగా గడిచాయని చెప్పాలి. నేను సుఖపడి ఉంటే, అప్పుడే సుఖపడి ఉండాలి. ఆనాడు ఆలోచనలు తక్కువ బాధ్యత ఎలా ఉన్నా, ఆశలు, ఆశయాలు ఏమీ ఉండేవి గావు.

ఆ దినాల్లో ఎలా మా అమ్మా, నాన్న అంత కుటుంబాన్ని నెట్టుకొంటూ సంసారాన్ని యీద గలిగారో ఇప్పటికీ నాకు అర్థం కావటంలేదు, తల్చుకొంటే ఎంతో బాధగా, భయంగా ఉంటుంది. జీవితంపై విరక్తి, రోత పుట్టుకొస్తుంది. అలా పేదరికంతో సతమత మవుతూ, సంసార కష్ట సుఖాలు అనుభవ పూర్వంగా తెల్సికూడ, నాకు వాళ్ళు ఎందుకు పెళ్ళిచేశారో అర్థంగాకుండా ఉంది అది యీ భూమిపై, వాళ్ళజీవితంలో చేయవల్సిన ముఖ్యమైన పనులలో మొదటదిగా తలంచి యుంటారేమో! అసలు సంసారంలో సుఖం అనేది, డబ్బుమీద గాక, వాళ్ళ, వాళ్ళ మన స్తత్త్వాలమీద ఆధారపడి ఉంటుందేమో! పేదరికంతో బ్రతకటం పాపంగాదు; కించపడవల్సిన అవుసరమూలేదు! కాని మూలిగే నక్కమీద తాటికాయ పడ్డట్లుగా, ఇలా కల్సిరానప్పుడే బాధగా ఉంటుంది. జీవితం అంటే హేయభావం, బ్రతుకంటే రోత పుడుతుంది.

నేను తల్లిదండ్రుల మాటలను జవదాటని శ్రీరామచంద్రుడిలా, ఎందుకు పెళ్ళి చేసుకొన్నానో నాకే తెలియదు. పెళ్ళి చేసుకొనటమే పొరపాటనుకొంటూ ఉంటే నల్గురు పిల్లలకు తండ్రినవటం మరొక పొరపాటు. యిలా అధికంగా అతుకుల బొంతగా ఏర్పడ్డ సంసార యాత్ర సాగించటంలో సత్యమార్గం సాధించుట తప్పదు. దాన్ని నిజంగా రూపించటానికి మరికొన్ని అసత్య మార్గాలు అవలంబించక తప్పదు. ఇలా జీవితం వెళ్ళదీసుకుంటూ పోవాలి. పిల్లలకు చదువు సంధ్యలు చెప్పించాలి, ఈ నాగరికతా ప్రపంచంలో వాళ్ళు మనుష్యులుగా బ్రతికేటట్లు చూడాలి. ఆనాడు కూడ, మా అమ్మ, నాన్న మమ్ములనుగూర్చి ఇలాగే అనుకొని ఉండవచ్చు. ఇది అంతా ఎందుకొచ్చినట్లు? ఆఫీసులో, పిల్లలనుబట్టి, సంసార బాధ్యతలనుబట్టి జీతాలు పెంచరు గదా! అలా అయితే యీ 150 రూపాయలతో కక్కుర్తిగా బ్రతుక వల్సిన గతి పడుతుందా? దొంగలు, దొంగలు ఊళ్ళు పంచుకొన్నట్లుగా ఉంది యీ మానవుల జీవితాలు.

నిజానికి లక్ష్మి చాల మంచిది కాబట్టి, ఏ లోటులేకుండా గడిపేది కాబట్టికాని, లేకపోతే నేను ఏనాడో సన్యాసం పుచ్చుకొని యుండేవాణ్ణి. పాపం. నన్ను చేసుకొని ఏమి సుఖపడింది ఆ యిల్లాలు? ఏదో చదువుకొన్నానని, ఏదో ఉద్యోగంచేస్తూ పదిరూపాయలు సంపాదించుకొంటున్నానని, సీదపట్టునుండి తమ కూతురు సుఖపడుతుందని లక్ష్మిని ఆమె తలిదండ్రులు నాకు ఇచ్చేశారు. నిజంగా నేను అదృష్టవంతుడననే చెప్పాలి. లక్ష్మి మట్టుకు ఎంతో దురదృష్టవంతురాలు. కాకపోతే నాకు భార్య ఎందుకవుతుంది? ఇంటి ప్రక్కవాళ్ళ తళుకు, బెళుకు వేషాలతో సినిమాలకు వాటికి తిరుగుతూంటే. తానొక్కనాడుకూడ సినిమాకు వెళ్ళదిగాదు. ఎప్పుడైనా బలవంతం చేస్తే "ఎందుకండి అనవసరపు ఖర్చు" అనేది. ఒక చక్కని చీరకూడ లేదుగదా! అందుకనే సిగ్గుతో ఎచ్చటకు బయటకువెళ్ళదేమో! ఏ మాటకు ఆమాటే చెప్పాలి. పాపం, పిల్లలుకూడ—ఎక్కువగా అది కావాలి, యిది కావాలి, అని గొడవచేయరు. వాళ్ళకుకూడ తెల్సి ఉండాలి వాళ్ళనాన్న చాల అసమర్థుడని. అబ్బ! తల బ్రద్దలు అయిపోతూంది.

తెల్సి నేనెవ్వరికీ, అక్రమము, అపకారమూ చేయలేదే? నాకు ఎందుకు యిలాంటి అన్యాయం జరిగింది? న్యాయానికి కూడులేదు, ధర్మానికి తావులేదు ఈలోకంలో. త్రోవలో, కుంటివాడో, గ్రుడ్డివాడో కన్పించి హా లక్ష్మణా అని ఏడుస్తూ ఉంటే, మధ్యాహ్నం ఆఫీసులో 'టీ' త్రాగటానికని తీసుకెళ్ళిన 10 నయాపైసలు యిచ్చి, పంపు నీళ్ళు త్రాగి ఆకలి తీర్చుకొనేవాణ్ణి అలాగే సిటీ బస్సుకు తీసుకెళ్ళిన డబ్బులు ఇచ్చి, అనేకసార్లు ఆఫీసు నుండి యింటికి నడచివస్తూ, వాళ్ళకు తగిన సహాయం చేయలేక పోయానే అని నాలో నేనే చింతించేవాణ్ణి. నాకు ఎందుకు యిలాంటి అన్యాయం జరిగింది? నన్ను గూర్చి ఎవ్వరు జాలిపడతారు? ఎవ్వరు దయదల్చి సహాయం చేస్తారు? ఎవరికెవరు ఈ లోకంలో?

ఆ క్రొత్త వందరూపాయలనోటు ఈ పాటికి మార్చాడేమో! మార్చి తన స్నేహితులతో కుషామతీ, జల్సా చేస్తూ ఉన్నాడేమో! వాళ్ళందరితో, తన ప్రతిభను, తెలివితేటలను, అదృష్టాన్ని, నా దద్దమ్మతనాన్ని గూర్చి గొప్పగా చెబుతూ ఉంటాడేమో. నేను గాడిదలా పని చేసి, అడుగులకు మడుగులొత్తి, కడుపుక్కూడా సరిగా తినకుండా, ఇలా వంద రూపాయలుకూడబెట్టి ఉంటానని, నాకూ పెద్ద సంసారం ఉందని తెలిస్తే, బాధపడతాడా! అతగాడు? ఏమో తీసుకొచ్చి ఇచ్చి వెళ్తాడేమో! నా

పిచ్చిగాని, అతడు నాలాంటి అసమర్థుడే అయితే, ఇలాంటి వ్యాపారం ఎందుకు చేస్తాడు? ఆలా తెచ్చి యిచ్చేవాళ్ళు అసమర్థులు ఉంటారా, నా తెలివి తక్కువ తనంగాక పోతే!

లక్ష్మికి, పిల్లలకు తెలిస్తే గొల్లుమంటారేమో! వాళ్ళకు ఎందుకు చెప్పాలి? తరువాత నెమ్మదిమీద రాముకు డబ్బు ఇవ్వవచ్చు. ఎప్పుడైనా నేను లేనప్పుడు ఇంటికి డబ్బుకు వస్తే లక్ష్మికి తెలుస్తుందిగదా! వ్రేలిలో ఉన్న ఉంగరం అమ్మి వెంటనే అప్పు తీర్చివేస్తా, పెళ్ళినాడు ఇది లక్ష్మి నా వ్రేలికి తొడిగిన ఉంగరం. ఎప్పుడో గుర్తువచ్చి లక్ష్మి తప్పక అడుగుతుంది. రేపు లక్ష్మికి ఆఫీసుకు వెళ్ళుతున్నట్లుచెప్పి, ఆఫీసుకుసెలవుపెట్టి, ఈ ఉంగరం అమ్మి, రాముకు డబ్బు ఇచ్చి, సాయంకాలం, మామూలు టైముకు యింటికి తిరిగివచ్చి, "లక్ష్మి, ఉంగరం స్నానానికి వెళ్ళబోయేముందు, ఇక్కడ పెట్టి మర్చిపోయా" అంటా, పనిమనిషి మీదకు పోతుంది ఆ అనుమానం అంతా! పాపం ఎన్నాళ్ళనుంచో ఒక రూపాయి తక్కువ యిచ్చినా, ఆలస్యంగా జీతం యిచ్చినా, ఏమీ అనుకొనకుండా, కుటుంబంలో మనిషిగా ఉంటున్న ముసలిదాని మీద ఆలాంటి అభాండం వేయటమా? అది అందరికి తెల్సి, అందరూ ఆ ముసలిదానిని పనినుండి తీస్తే, అభిమానంతో, ఆ ముసల్ది చచ్చిపోతే ఆ పాపం నాకు కొట్టదూ? అమ్మ బాబోయి! నేను మట్టుకు ఆపని చేయలేను, పిల్లలమీద పెడితే. పాపం, వాళ్ళు, అర్థం, కుర్థం ఎరుగనివారు. చిన్న పిల్లలు దేవునితోసమానం అంటారు! అంతకన్నా ద్రోహం మరొకటుందా! వీటన్నిటికన్నా నేనే చచ్చిపోతే ఈ సమస్యే ఉండదు అప్పుడు అడిగేవాళ్ళూ ఉండరు, ఇచ్చేవాళ్ళూ ఉండరు. లక్ష్మి పిల్లలు ఎలా బ్రతుకుతారు? అబ్బ! తల బ్రద్దలయిపోతూంది! పిచ్చి ఎక్కేటట్టుంది, వంద రూపాయలు- క్రొత్తనోటు. నలగకుండా నాలుగుమడతలు పెట్టి జేబులో అప్పుతీర్చటానికి పెట్టుకొన్న వందరూపాయలనోటు.

ఏమండీ. ఇంత ప్రొద్దుపోయేవరకు ఎక్కడున్నట్టు?

"అఁ – లక్ష్మి. నీవా?"

"అదేమిటండి, బట్టలూ, వళ్ళూ అంతా దుమ్ము. నడుస్తూ, నడుస్తూ పడ్డారా? దెబ్బలేమయినాతగిలాయా?"

"ఆ! బీచికి వెళ్ళి వస్తున్నా. పిల్లలు నిద్రపోయారా?"

"అఁ... .. రాముగారు వచ్చివెళ్ళారు."

"వచ్చాడా!......ఏమన్నాడు?"

"మీరు డబ్బు పోయిందని, మరొకమాట చెప్పకుండా, పిచ్చివారిలా, పరుగుత్తుకొచ్చారటగా! భయంవేసి వచ్చాడు. ఇప్పటివరకు మీరు వస్తారని కూర్చొన్నాడు. ఇప్పుడే వెళ్ళాడు"

"అవును లక్ష్మి. వందరూపాయలు ఎవడో కొట్టేశాడు. ఆ క్రొత్తచెక్కు, మనం కమ్మగా తినకుండా, పిల్లలకుకూడ పెట్టకుండా అప్పుతీర్చటానికి దాచిన వంద రూపాయల చెక్కు పోయింది లక్ష్మి. నేను వర్థి దద్దమ్మను. నాలాంటివాళ్ళు బ్రతటంకంటే చావటమే మంచిది"

"ఎందుకండి అలా ఆడవాళ్ళలా ఏడుస్తారు? పిల్లలు లేస్తారు. పోయిందేదో పోయింది. ఏడిస్తే వస్తుందా? అంతా మన మంచికే"

"కాదు లక్ష్మి. నేను....... ."

"ఏదో ఒకటి అమ్మి తీరుద్దాము లెండి. ఎందుకలా, యిది అవుతారు? పోయింది వస్తుందా? చాల ప్రొద్దు పోయింది. భోజనానికి లేవండి".

---

# నరకాసుర వృత్తాంతము

శ్రీ విద్వాన్ వేదము లక్ష్మీనారాయణ శాస్త్రి, బి.ఓ.యల్.

శ్రీకాళికాపురాణమున 37-నుండి 41 – వ అధ్యాయాంతము వఱకును నరకుని వృత్తాంతము కలదు. నరకాసురుఁడనియు నతనికి వాడుకపేరు కలదు. నరకుని వృత్తాంత ముందడవుచో కామరూప దేశప్రాచీన చరిత్రముఁగూడఁ గొంతదనుక నూహింప నవకాశముగలదు. సంక్షేపముగా ఆవృత్తాంతమిది :

వరాహావతారకాలమున విష్ణుమూర్తి వలన భూదేవి మలినిగా నున్నప్పుడు గర్భము ధరించెను. పది మాసములు పూర్తియైనను ప్రసవవేదన కలిగినను ప్రసవము మాత్రము కాలేదు. ఆవేదన భరింపఁజాలక యామె విష్ణుమూర్తికడ కేఁగి సుఖప్రసవము నను గ్రహింప వేఁడెను. కాని విష్ణుమూర్తి దీర్ఘకాలము గడచినఁగాని యామెకు శిశూదయము కాఁబోదని తెలిపెను. ఆయన,

అష్టావింశతి మే ప్రాప్తే ఆది సర్గాచ్చతుర్యుగే
త్రేతాయుగస్య మధ్యేతు సుతం త్వంజనయిష్యతి॥
26 అ, 89 శ్లో.

అని చెప్పి. పదపడి.

గర్భస్త్వవ మహాభాగే త్రేతాయాం మధ్యభాగతః
ఉత్పత్స్యతే హతే వీరే రావణే రామసంజ్ఞినా॥
36 అ. 50 శ్లో.

అని పలికి, తన శంఖము నామె శరీరమునకుఁ దాఁకించెను. అంతటితో సహింపనలవి కాని కడుపుకుట్టు లన్నియుఁ దొలఁగి ఆమె యధేచ్ఛగా తిరిగిపోఁగలిగెను. తర్వాత నుచితకాలము ప్రాప్తించి రావణుఁడు శ్రీరామునిచే నిహతుఁడయిన సమయమున భూదేవియు విదేహదేశమున నొకకుమారునిఁ గనెను,

ఆ సమయమున విదేహదేశమును ఒక్క జనకరాజు పరిపాలించుచుండెను, అతనికి సంతానములేదు. అందులకై యతఁ డొకయాగము చేసెను. తత్ఫలముగా నతని కిరువురు కుమారులు గలిగిరి. యాగశాలకై దున్నుచుండఁగా నేలనుండి యాతని కొక కుమార్తె దొరకెను. ఆమెయే సీత. భూదేవి యా కుమార్తె నతని కప్పగించుచు తనకుఁ గలుఁగ బోవు కుమారుని కనీస మతనికి పదునాఱేండ్ల ప్రాయము వచ్చునఱకైనను పోషింపవలసినదిగాఁ గోరి ప్రతిజ్ఞ చేయించుకొనెను. అంతేకాదు. తానాకుమారుని కన్నతల్లియను విషయమును గూఢముగ దాఁపఁ గోరెను జనకుఁడును నందులకు సమ్మతి తెలిపెను. రావణవధానంతర మామె ప్రసవించి శిశువును జనకరాజు నొద్దకుఁ దెచ్చి, మున్నాతఁడు తన కిచ్చిన వాగ్దానమును స్మృతిపథమునకుఁ దెచ్చి యాక్రొత్తనిసుగును రక్షింపవేఁడెను. దనకుఁడును స్వవాక్యపరిపాలనా ప్రియుఁడై శిశు వున్న స్థలమునకుఁబోయెను. అక్కడ నాశిశువు ఒక నరకపాలముపై తలనిడి పరుండి యుండఁ జూచెను. కనుక,

నరస్య శీర్షేస్వశిరో నిధాయస్థితవాన్యతః *
తస్మాత్ తస్యమునిశ్రేష్ఠో నరకం నామ వైవ్యధాత్ ॥ 38 అ. 2 శ్లో.

ఆబిడ్డకు నరకుఁ డనునామ మిడి తన యితరసంతానముతోఁ గూడ పెంచుకొనుచుండెను. భూదేవియు ధాత్రి -(దాది) రూపమున జనకునంతఃపురము చేరి కుమారుని పోషించుచుండెను.

కాని కాలక్రమమున నరకుఁడు జనకునిసంతానము కంటెను ఓజస్సునను తేజస్సునను అతిశయించెను, అందువలన జనకునకు నరకునందసూయ జనించెను. జనకుని హృదయమునఁ గల్గిన యీ మార్పును భూదేవి సూక్ష్మముగ పసిపట్టి పూర్వము నిర్ధారించుకొన్న కాలమానము పూర్తియగుటకు ముందే యటనుండి కుమారుని స్థలాంతరమునకుఁ బంప నిశ్చయించెను. కావున నరకునకు పదునాఱవయేఁడు సమాప్తి కానున్న తరుణమున నతనిని గంగాతీరము

* నరక శబ్దమునకీ యుత్పత్తి సరియైనదికాదు. వెనుకటికి దీని సహజార్థము వివరింపఁబడును.

నకుఁ గొనిపోయి యచట రహస్యముగాఁ దానాతనికిఁ గన్నతల్లి- యను రహస్యమును వెల్లడించెను. ఆ బాలుఁ డన్ననో, విష్ణుమూర్తియే తనకుఁ బ్రత్యక్షమై యావృత్తాంతము వివరించుచో నామె మాటలు విశ్వసింతు నని పలికెను, అంత భూమి విష్ణుమూర్తిని ధ్యానింపఁగా ఆదేవుఁడు ప్రత్యక్షమై యామెమాటలు ధ్రువపఱచెను.

తరువాత విష్ణుమూర్తి భూమితోను నరకునితోను ప్రాగ్జ్యోతిషపురమునకేఁగెను. ఆసమయమున ఘటకుఁ డనునొక కిరాతరాజు దేశమునకు ప్రభువు, ఆఘటకునితోఁ బోర నరకుని విష్ణువు ప్రేరేచెను. ఆ యుద్ధమున విజయము నరకునిదే. ఘటకుని సైన్యము నరకుని తేజము నోర్వఁజాలక చెల్లాచెదరై పోయెను. అంతట విష్ణుమూర్తి నరకుని ప్రాగ్జ్యోతిషమునకు ప్రభువుగా నభిషేకించి. కామాఖ్యాదేవిని పూజించుచుండ నుపదేశించెను. ఎట్టి తరుణముననను బ్రాహ్మణ పరాభవమునకు యత్నింపవలదని కట్టడయొనర్చి, విదర్భదేశ రాజకుమారి మాయాదేవిని అతనికి పరిణయముగావించి చిరకాలము రాజ్యము పాలింపుమని దీవించెను.

త్వంతు ప్రజాయై త్రేతాయాం యత్నవానైవ భవిష్యసి
ద్వాపరాంతతు సంప్రాప్తే ప్రజాతవ భవిష్యతి॥
38 అ. 140 శ్లో

ఇట్లు నరకుఁడు కామరూపమున కధిపతియై బహు దీర్ఘకాలము పరిపాలించెను. అతని పాలనము న్యాయయుక్తము ధర్మయుతమునైనది. ఇట్లుండఁగా ద్వాపరాంతమున నరకునకు శోణిత పురాధిపుఁడైన బాణునితో మైత్రి కుదిరెను. ఈ బాణుఁడు శివభక్తుండే కాని బ్రహ్మద్వేషి; అతని సాంగత్యమున నరకుఁడును నానాఁటికి గుణహీనుఁడై ధర్మ రహితుఁడయ్యెను. ఒకానొకప్పుడు కామాఖ్యాదేవి నర్చించు నిమిత్తము ప్రాగ్జ్యోతిషమునకు వసిష్ఠ మహర్షి వచ్చెను. నరకుఁ డాయన నాదరింపక పోవుటకు తోడు, దేవ్యాలయ ప్రవేశమునకును అనుమతింపలేదు. అంత వసిష్ఠుఁడు అతనిని నాశనము కా శపించెను.

ఈ మధ్య నరకుఁడు శివారాధనకు పాల్పడి కామాఖ్యదేవీ పూజన ముపేక్షించుటయేగాక శివాను గ్రహబలమున బ్రాహ్మణులను మాత్రమేగాక తదితరుల సైతము వేధింప సాగెను. అతఁడు గర్వాతిరేకమున పదునాఱువేల మంది స్త్రీలను చెఱఁబెట్టెను. దేవమాతయగు నదితి కుండలములను బలాత్కారముగ గ్రహించుకొని పోయెను. అంతట దేవతలు దుష్టనిగ్రహార్థ మవతరించియున్న శ్రీ కృష్ణునిఁ జేరి నరకుని శిక్షింపఁ గోరిరి. కృష్ణుఁడు నందులకు సమ్మతించి కా మరూపమునపై దాడి వెడలి నరకుని వధించి పదునాఱు వేలమంది నారీమణులను కారాగారవిముక్తలఁ గావించి, అదితికుండలములు సైతము తీసికొని వచ్చెను. అటుతర్వాత నరకుని సంతానమును రక్షింపవేఁడిన భూదేవి ప్రార్థనను గౌరవించి నరకుని నప్పుఁడైన భగదత్తుని సింహాసన మెక్కించి కృష్ణుఁడు ద్వారకకు మరలెను

ఇది కాళికాపురాణములోని నరకుని వృత్తాంతం సారసంగ్రహము. ఈకథనుండి మన మీక్రింది చారిత్రకాంశముల నూహింపవచ్చును :

1. నరకుఁడు జనకునకు స్వీకారపుత్రుఁడైనను కావచ్చును; లేదా, భూమి యనుపేరు గల్గినదాది యందు జనకునకు జనించిన కుమారుఁడైనఁ గావచ్చును, ఆకుమారునే స్వీకారపుత్రుఁడుగా ప్రకటించియుండవచ్చును, కనుకనే ఆభూదేవి కుమార్తె సీత నరకునితోఁబుట్టువు (చెల్లెలు)గాను నుండవచ్చును.

2. వెనుకటికి నరకుఁడు అతిధీరుఁడుగా పరివర్తనమంది జనకునకు భీతి కారకుఁడయ్యెను.

3. అందువల్ల నరకుని తల్లి కుమారునకు అపాయమును శంకించి విదేహరాజ్యమునుండి యతనిని రహసముగా స్థలాంతరము చేర్చియుండును.

4. పిమ్మట నామె నరకాసురుని తోడ్పాటున కాలక్రమమున నొకసైన్యము సమకూర్చుకొని కామరూపదేశముపై దాడివెడలి యుండును.

5. ఆదేశమును పాలించుచుండిన కిరాతరాజు ఘటకుని యుద్ధములో సంపూర్ణముగ నోడించి రాజ్యము నాక్రమించి నరకుఁడే యధిపుఁడై యుండును.

(సశేషము)

# వార్తావళి

అమెరికా:— అక్టోబరు ప్రారంభించేసరికల్లా ఐక్యసమితి సభాసమావేశాలకి నానారాజ్యాల ప్రతినిధులు చాలామంది హాజరయ్యారు. శ్రీ వి. కె. కృష్ణమీనన్ గారి నాయకత్వంక్రింద మన దేశప్రతినిధులుకూడా ముందుగానే న్యూయార్కు చేరారు.

ప్రధాని శ్రీ పండిత నెహ్రూగారుకూడ విధివిరామం లేకుండా బెంగుళూరిలో 15-9-60న జరిగిన శ్రీ విశ్వేశ్వరయ్యగారి శతవార్షికోత్సవం, ఆతరువాత కరాచిలో (చాలకాలంగా వివాదంలో ఉండిన) కాల్వలనీటితగాదా ఒడంబడికలో పాకిస్థాను అధ్యక్షుడు అయూబ్‌ఖానుతో చేరి చేవ్రాలుచేసి న్యూఢిల్లీకి వెళ్ల టమేతడవుగా న్యూయార్కుకు ప్రయాణమయ్యాడు. అనేక రాజ్యాల అగ్రనాయకులు ప్రపంచక్లిష్టసమస్యల్లో ఆయన అభిప్రాయాలు తెలుసుకోవటానికి చాలా ఉబలాటపడ్డారు.

ఆయన అమెరికాలో ఉన్నన్నాళ్లు ఒక్క క్షణం అయినా వ్యర్థంచేయకుండా ఆయా 'అగ్రరాజ్యాల ప్రధానుల్ని అధ్యక్షుల్ని కల్సుకొని అన్ని విషయాలు చర్చించారు. బ్రిటిషు ప్రధానిని అమెరికా అధ్యక్షుని కలుసునొని ఒక్కగంట యావత్పరిస్థితుల్నిగూర్చి సావధానంగా మాట్లాడారు. అన్నిరాజ్యాల ప్రతినిధులను కలుసుకోవటానికి అనుకూలంగా అల్పాహారవిందు జరిపారు. సోవియట్ ప్రధాని శ్రీ నెహ్రూగారి సామరస్య సుహృద్భావాలను మెచ్చుకొని అన్నిసందర్భాలలో ఆయన సలహాలు తీసుకుంటూ వచ్చాడు.

మన ప్రధానిగారు ఐక్య జాతీయ సభలో ప్రసంగిస్తూ, కృశ్చేవ్ — ఐసెన్‌హోవరులు మరల కలుసుకోవడంవల్ల చాలా క్లిష్టసమస్యలు అనుకూలంగా తీర్మానించుకోవచ్చునని సూచించారు.— అసలు సమితి నిర్మాణంలోనే కొన్ని కొత్తమార్పులు జరగాల్నని చెప్పారు సమితి కార్యనిర్వాహక సంస్థే లోపభూయిష్ఠమని అన్ని రాజ్యాల్లో ఒక దురభిప్రాయం వ్యాపించి పోయిందనీ అందుకు కారణం (వ్యక్తిగతంగా) సర్వ కార్యదర్శి అయిన హేమర్కుజోల్డు కాదనీ అన్ని విషయాల్లోనూ సంస్థ అమెరికా బ్రిటిషు రాష్ట్రాల చెప్పుచేతల్లో నడుస్తుందనీ, అందుచేత తక్కిన రాజ్య వివహారాల పర్యాలోచనలో సమితి స్వక్రమంగా చరించడానికి ఆటంకం కలుగుతుందని వివరించారు.

నిరాయుధీయ విషయం, పెద్ద రాజ్యాల శిఖరాంగ్ర సమావేశావసరం— వీటినిగూర్చిగూడా ఉగ్గడించారు. విధ్యుక్త ధర్మాన్ని నిర్వహించి మన ప్రధాని 11 తారీఖునాటికి న్యూఢిల్లీ చేరుకోగానే. ప్రధాని కృశ్చేవ్ ఆమరునటినాడే వలసరాజ్యాల విముక్తి సమస్య నిరాయుధీకరణ సమస్యలనిగూర్చి సమితి సభలో తీవ్రంగా ఉపన్యసించాడు. కాని మహాసభలో దాన్ని చర్చకు పెట్టాల్నని ఆయన తెచ్చిన తీర్మానం వీగిపోయింది.

17.10.60 తారీఖున శ్రీ వి. కె. కృష్ణమీనన్‌గారు ఇరవై రాజ్యాలతో సంప్రదించి ప్రపంచ శాంతి స్థాపన కొక మసోదా తయారుచేసి సమితి సభలో ప్రవేశపెట్టారు దాన్ని చర్యకు పెట్టడానికి సమితి అధ్యక్షుడు బోలండు సమ్మతించాడు.

లావోస్‌స్థితి:— లావోస్ విప్లవపక్ష ప్రధాని, సావనా రాజకుమారుడు, లావోస్‌కు సహాయం చేస్తామన్న అమెరికా, అడ్డం తిరిగే పక్షంలో కమ్యూనిస్టు రాజ్యాల సహాయం తమ రాష్ట్రం అపేక్షింపక తప్పదన్నాడు. ఇంకా, అయన ఇలా చెప్పాడు:— "అమెరికా తాను చేస్తానన్న సహాయాన్ని తాత్కాలికంగా నిలిపే సందర్భంలో ఏ విధానాన్ని అవలంబించినా, ఏ విధంగా తీర్మానించినా, తనప్రభుత్వం తాటస్థ్యాన్ని వహించి ఉండడంలో ఎవరూ ఆటంక పెట్టక లేరనీ, తమ రాజ్యాంగ పద్ధతియొక్క ప్రస్తుత క్లిష్ట పరిస్థితుల్లో భారతదేశం ముఖ్యంగా తనవలన ఐనంతవరకు అనుకూలంగా ప్రవర్తించగలదని — ఆయన వెల్లడించాడు.

జపాన్:— జపాన్ దేశంలో ఎన్నికలు జరుగనున్న సందర్భంలో అక్కడి ప్రధాన సోషియలిస్టు పార్టీ అధ్యక్షుడయిన 'ఇనాజిరో అసానుమా' — అనే అతణ్ణి 'ఓటోయో యామా గూచి' — అనే 17 ఏండ్ల విద్యార్థి ఒక బహిరంగ సభలో ప్రసంగిస్తుండగా హత్యచేశాడు. ఆ సభ ఎన్నికల కార్యనిర్వాహక సంఘం జపాన్ ఆకాశవాణి సంస్థలచేత సమావేశ పరచ

బడింది. సభలో జపాన్ ప్రధాని 'ఇకెడా', ఇతర ఉన్నతోద్యోగులుకూడా వున్నారు. అక్కడి పార్టీలలో ప్రసిద్ధమయినవి రెండే. సోషియలిస్టు పార్టీ ఒకటి. రెండోది పరిపాలక వర్గానికి చేరినవి బరల్ డెమొక్రెటిక్ పార్టీ ఒకటి. అందుచేత, ప్రభుత్వ ప్రోద్బలం చేతనే యీ హత్య జరిగి ఉండాల్నని వదంతులు వ్యాపించాయి. దానికనుగుణంగా, రక్షణ శాఖోద్యోగులలో ముఖ్యులు తమ పదవులకు రాజీనామా ఇచ్చారు.

ఏది యెట్లున్నా, ఈ హత్య జరగడానికి మూల కారణాలు, దానికి పూనుకొన్నవారి కుట్రలు మొదలయిన వాటిని గురించి పూర్తిగా విచారణ చేయాల్నని ప్రధాని ఉత్తర్వు జారిచేశాడు.

న్యూఢిల్లీ :— ఇటీవల టోక్యోలో "భారతదేశంలోని పార్లమెంటరీ ప్రజాపాల"నాన్నిగూర్చి ఉపన్యసించడానికి జపానుకు వెళ్ళియుండిన లోక సభాధ్యక్షులు శ్రీ అనంతశయనం అయ్యంగారు తిరిగి స్వదేశం చేరుకున్నారు.

పశ్చిమ దేశాల్లో మూడవ పంచవర్ష ప్రణాళికా కార్యక్రమాలకు సహాయం అర్థించడానికి వెళ్ళియుండిన కేంద్ర ఆర్థిక మంత్రి శ్రీ మురార్జీ దేశాయి గారుకూడా ముఖ్య నగరానికి తిరిగివచ్చారు.

హిమాలయ ప్రాంత పుణ్యక్షేత్ర సందర్శనోత్సుకులై యాత్రలు వెళ్ళియుండి భారతాధ్యక్షులు రాజేంద్రప్రసాదుగారు మరల న్యూఢిల్లీకి ప్రధానిగారు వచ్చిన మరునాడే చేరుకొన్నారు.

భారతదేశంలో బ్రిటిషు హైకమీషనరుగా ఐదేండ్లు పనిచేసిన సూల్కం మెక్డొనాల్డుగారు ఉద్యోగం చాలించుకొని సతీమణితోకూడా స్వదేశానికి 17-10-60 ని వెళ్ళే సందర్భంలో — ఉన్నతోద్యోగులయిన భారతీయులు, ప్రముఖ నాయకులు ఆ దంపతులకి విమానాశ్రయంలో ఘనంగా వీడ్కోలిచ్చారు. బ్రిటిషు ప్రభుత్వకార్యాలు సంతృప్తికరంగా నెరవేరుస్తూ, భారతదేశంలో ఉన్నతోద్యోగులకు నాయకులకు తలలోని నాల్కగా మెలగుతూ, ఇక్కడి సాంఘిక విషయాల్లో పాల్గొంటూ అనేకులను మిత్రులను ఆర్జించుకొన్న ఈ మెక్డొనాల్డుల జీవితం ధన్యమయింది.

చైనా హిందూదేశాల సరిహద్దుల తగాదాలను గూర్చి చర్చించే ఇరుపక్షాల ఉద్యోగివర్గం మొదట పెకింగులోను, తరవాత న్యూఢిల్లీలోను సమావేశమయ్యారు. ఇంకా ఈ సమస్య తెగలేదు. ఇప్పుడింక మూడవసారిగా తటస్థరాజ్య ముఖ్య నగరం అయిన రంగూనులో సమావేశమౌతారనీ ఇది రెండు దేశాల వారికీ అనేక విధాల అనుకూల ప్రదేశమనీ, అలా సమావేశమయ్యేకాలం మున్ముందు సూచింపబడుతుందని ప్రధానిగారు పత్రికావిలేఖరి వర్గానికి (21-10-60) తెలిపారు.

ఆంధ్రప్రదేశ్ :— ఈ మధ్య ఢిల్లీకి వెళ్ళివచ్చిన, మంత్రివర్గీయులు యూనైటెడ్ ఫ్రంటువర్గీయులు అఖిల భారత దేశీయ సభా కార్యదర్శి - సాదిక్ ఆలీ గారి రాజీతీర్మానానికి సమ్మతించి స్వస్థలం చేరుకున్నారు. ఈ రాజీ ఫలితంగా శ్రీ నరోత్తమరెడ్డి గారు అధ్యక్ష పదవినుండి తొలగాల్ననీ, ఆయనకు బదులు మంత్రి పదవిలో ఉన్న పల్లంరాజుగారు అధ్యక్షులుగా ఎన్నుకోబడాల్నని యేర్పడింది. ముందు ముందు వేచి చూడాలి.

భారతాధ్యక్షులు, శ్రీ గంటి చంద్రశేఖరశాస్త్రి గారిని ఆంధ్రా హైకోర్టు జడ్జిపదవికి ఖాయంగానూ, శ్రీ అమిదన్న సత్యరత్నరామచంద్రరావుగారిని అడిషనల్ జడ్జిగ 1961 సెప్టెంబరు 9 తారీఖు వరకున్ను నియమించారు.

మద్రాసురాష్ట్రం :— వందరూపాయల కరెన్సీ నోట్ల సృష్టి కేసు సెంటు థామస్ మౌంటులో ఒక స్పెషల్ మేజిస్ట్రేటు విచారణక్రింద జరగాల్నని లోగడ హైకోర్టు తీర్మానించింది. కాని, అది తమ కందుబాటులోని స్థలంకాదనీ తమకు సౌకర్యాలు చాలా తక్కువ అనీ కనుక తమ స్వస్థలాలకు అనగా కోయంబుత్తూరు సేలం జిల్లాల ప్రాంతాలకు మార్చాల్నని ముద్దాయీలు కోరారు. దానిమీద అది మద్రాసు నగరంలోనే తాము నియమించిన స్పెషలు జడ్జి విచారించటానికి హైకోర్టు ఆజ్ఞాపించింది.

భారతాధ్యక్షులు, శ్రీ పి. రామకృష్ణ అయ్యర్, శ్రీ పి. యస్. కైలాసం. శ్రీ టి. వెంకటాద్రి గార్లను హైకోర్టు న్యాయమూర్తులు (ఖాయం)గా నియమించారు.

# గ్రంథసమీక్ష

సమీక్షకు రెండేసి ప్రతులు పంపాలి.

## వైద్యశ్రీ

సంపాదకుడు: శ్రీ ప్రకాశచంద్రశతపథి- ఆంధ్ర ప్రదేశ్ ఆయుర్వేద మహామండలి; గవర్నరుపేట- బెజవాడ- 2.- వెలర్పు 3/-లు

హైదరాబాదు మొదలయిన నగరాల్లో జరిగిన ఆయుర్వేదమహాసభల వృత్తాంతాలూ, ఆ యా సభల్లో ఆయుర్వేదపరిచయం ఉన్నా, లేకున్నా, ఘనంగా ఉపన్యసించిన పెద్దల ఉపన్యాసాలూ, అధ్యక్షులు శ్రీ రాజేంద్రప్రసాదు గారి మొదలు, మంత్రి శ్రీ తిమ్మారెడ్డిగారివరకు ఇచ్చిన నిరుపమానాభిప్రాయసూక్తులు ఇందులో ఉన్నాయి.

సంపాదకు లిదవరకు చన్న– ఇప్పుడున్న ఆయుర్వేద వైద్యశిరోమణుల జీవితసంగ్రహాల్ని వారి చిత్రాలతోకూడా సేకరించి ఇందులో చేర్చటం మెచ్చతగింది.

కాసీసభస్మం, శీతాంశురసం, త్రిదోషవిజ్ఞానం. చేదుకట్లు మొదలయినవాటినిగూర్చి కొన్నివ్యాధులనుగూర్చి మంచి వ్యాసాలుకూడా చేర్చబడ్డాయి. తేలుకాటు, హృదయ శూలలవంటివాటికి చిట్కా-చికిత్సలు సూచింపబడ్డాయి, ప్రతియింట ప్రతివైద్యుని చేత ఉండతగిన గ్రంథం.

ఒక్క-విషయంమాత్రం విచారకరం. తోడివృద్ధ వైద్యుల్ని, జీవితమంతా వాఙ్మయ వైద్యకళాభ్యుదయాలకే వ్యయంచేసిన శ్రీ ఆచంట లక్ష్మీపతిగారిని 264పుటలో సంకరవైద్యప్రచారక బిరుదంతో ఈసడిస్తూ ఏ ప్రబుద్ధులో (వైద్యులే) చేసిన విమర్శమాత్రం ఆయుర్వేద వైద్యులకి ఐక్యంలేదనే భావాన్ని చాటుతుంది. ఇలాంటివి ప్రకటించకుండటం శ్రేయస్కరం.—— పుస్తకం పైఅట్ట కొంచెంబటువుగా ఉండుంటే బాగుండేంది!

## ప్రసన్నాంజనేయము

తిరువాయి రాఘవసూరిగారు, 3. సాంబశివరెడ్డివీధి, మద్రాసు—11; మూల్యము: ఒక్క-రూపాయి.

శ్రీ మద్రామాయణమందలి సుందరకాండమునకు ఇది స్వేచ్ఛానువాదము, కవిత ప్రాచీనచ్ఛందస్సులో చక్కని తేటగీతములతో జాలువాఱినది. సంస్కృత సుందరకాండమును పారాయణమొనర్పఁజాలనివారి కిది చింతామణివంటిదన్న చాలును. మచ్చునకు :—

> రఘుపతిచరిత్ర మెచటఁ గీర్తనమొనర్తు
> రచట గృతమస్తకాంజలి వగుచు నీవు,
> గనుల నానందబాష్పముల్ గార నిల్తు
> వమరగణగేయ సుప్రసన్నాంజనేయ ॥
>
> అమలకమల వినీలోత్పలాంచితమ్ము,
> హంసకారండవాది విహంగయుతము
> రమ్య పుష్పిత తరులతా రాజితమ్ము
> రుచిరసలిలమ్ము పంపాసరోవరమ్ము ॥

## వ్యాసమంజరి

కర్త : విద్వాన్- కా. సంజీవరాయశర్మగారు ; ప్రతులకు : ఉదయరంజనీ పబ్లిషర్సు, 66, సామిపిళ్ళెవీధి- మదరాసు.

(వెల- ప్రతి, 1 కి ఒక్క-రూపాయి)

ఇది ఉన్నతపాఠశాలా విద్యార్థులకేగాక, ఉన్నతప్రాథమిక మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు ఉపయుక్తము. విషయములు విజ్ఞానార్జనమునకేగాక, సారస్వత సంఘ చర్చలకును పనికి వచ్చును, ప్రతివిద్యార్థియు తప్పక కొనదగిన గ్రంథము.

## గ్రంథ స్వీకారము

1. వ్యాసవాణి : (రెండవభాగము) వెల- ఒక్క-రూపాయి.
2. గురుదక్షిణ ? వెల ఒక్క-రూపాయి.
3. సన్మాన సంచిక : (వెల తెలియదు.) ప్రకాశకులు ; భారతీసమితి.పామఱ్ఱు : కృష్ణాజిల్లా.
4. రజతోత్సవ సంచిక ,,
ప్రకాశకులు :- కౌముదీపరిషత్తు విజయనగరం.

# అమృతాంజనము

## అన్ని నొప్పులకు దివ్యామృతము

1893 నుంచి లక్షలాది ప్రజలు అమృతాంజనం వాడి, ఎంత అమోఘమైన శక్తికలదో తెలుసుకుంటున్నారు. అమృతాంజనంలో వాడే ఔషధాలన్నీ అతి శీఘ్రంగా బాధను పశమింప చేయుటయేగాక, చాలా హాయిని కూడా కలిగిస్తాయి. హాని కలిగించే పదార్థాలేమీ లేవు కూడా. దగ్గు, జలుబు మొదలైనవి కూడా శీఘ్రంగా ఉపశమిస్తవి. అమృతాంజనం దగ్గర ఉంటే మీ రెటువంటి బాధనైనా జయించవచ్చు.



# ఆంధ్ర మహిళా సభ

## మైలాపూర్ - మద్రాసు

| | |
|---|---|
| మహిళా విద్యాలయము | : హిందీ, కాశీవిశ్వవిద్యాలయపుఎడ్మిషన్, ఆంధ్రామెట్రిక్, ఇ.ఎస్.ఎల్.సి., పరీక్షలకు శిక్షణ. |
| పారిశ్రామిక విద్యాలయము | : కుట్టు. ఎంబ్రాయిడరీ, ఊలు అల్లికలు, నూలు వడకుట, చేనేత, అచ్చుకూర్పు, ముద్రణ, బైండింగ్ ఇత్యాది పరిశ్రమలలో గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ, బీద విద్యార్థినులకు ఉచితము. |
| మహిళా మందిరము | : విద్యార్థినులకు వసతి గృహము. |
| ఆంధ్ర మహిళ | : స్త్రీలలో విద్యా వ్యాప్తికై స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాస పత్రిక |
| నర్సింగ్‌హోమ్ | : స్త్రీ శిశు సంరక్షణశాల, ప్రసూతిశాల, ఉచిత వైద్యశాల' కుటుంబ నియంత్రణశాఖ, దంత వైద్యశాఖ— అడయారులో నిర్మించబడినది. భారత ప్రభుత్వ ఆరోగ్య శాఖవారి విధానాన్ని అనుసరించి, సంక్షిప్త నర్స్ఎయిడ్ —మంత్రసాని పనులలో శిక్షణ యివ్వబడుచున్నది. ఫామిలీ ప్లానింగు వర్కర్సుకు శిక్షణకూడ యివ్వబడుచున్నది |
| ఆర్థోపీడిక్ సెంటర్ | : వికలాంగులగు బాలబాలికలకు సంరక్షణ, విద్య యిచ్చే సంక్షేమకేంద్రం. |
| ముద్రణాలయము | : విద్యార్థినులకు అచ్చుకూర్పు, బైండింగ్, ప్రూపురీడింగు, మొదలైనవి ఉచితంగా నేర్పబడును. ప్రింటింగు జాబ్ వర్క్సు చేయబడును. |
| నాగేశ్వర శిశువిహార్ | : పిల్లల విద్యావినోద కేంద్రం. ప్రాథమిక పాఠశాల నడుపబడుచున్నది |
| అర్బన్‌వెల్ఫేరుప్రాజెక్టు | : కపాలి తోట్టంలోను నారాయణస్వామి గార్డెన్‌లోను బీదలకు సంక్షేమ కార్యక్రమముల నిర్వహింపబడుతోంది |
| వనితా బాలవిహార్ | : స్త్రీలకు, పిల్లలకు- పార్కు., ఆటస్థలం. |
| రీజియనల్‌హాండీక్రాఫ్ట్సుయిన్స్టిట్యూట్ | : ఆంధ్రమహిళాసభ, హైదరాబాదుబ్రాంచిచే నడుపబడుచున్న చేతిపనుల శిక్షణాలయము |

# "ఆంధ్ర మహిళ"

(ఆంధ్ర మహిళాలోకాభ్యుదయ మాసపత్రిక)

వ్యవస్థాపకురాలు :

## శ్రీమతి దుర్గాబాయిదేశ్‌ముఖ్

విడి పత్రిక–37 నయాపైసాలు ప్రత్యేక వార్షిక సంచికతో కలిసి

సం॥ చందా - రూ. 6-00.

పంచాయతీ సంస్థలకు. సంక్షేమ సంఘాలకు, పౌరజన గ్రంథాలయాలకు పాఠశాలా పుస్తక భాండాగారాలకు సగము చందా సం॥ ర౦॥ కి రూ. 3-00 లు.

## పత్రికా విక్రయసంస్థల యేజంట్లకు

1. 'ఆంధ్ర మహిళ' ఆరింటికంటె తక్కువ ప్రతులకు ఇచ్చే ఆర్డర్లు గమనింపబడవు.
2. పత్రికకు 1 కి 12 న. పైసాలు కమీషను ఇవ్వబడును. పోస్టేజి మేమేభరింతుము.
3. విక్రయంకాని సంచికలు వాపసు తీసికోబడవు.
4. ప్రతినెల "ఆంధ్ర మహిళ" ఎన్నిప్రతులు కావలెనో సూచిస్తూ. అసలుక్రయంలో కమీషను మొత్తం మినహాయించుకొని, తక్కిన మొత్తంతో వచ్చే ఆర్డర్లు అంగీకరింప బడును.
5. ప్రత్యేక వార్షిక సంచిక ప్రతి 1. కి రూ. 2 లు, అయినా, యేజంట్లకు రూ. 1. 50 కే, (అనగా 25. కమీషన్ మినహాయింపుతో) ఇవ్వబడుతుంది.

## ఆంధ్రమహిళ

## ప్రకటన రేట్లు

సామాన్యమైన పుట 1 కి. రూ 60. లు,

అట్టకాగితం 2 వ పుట, 3. వ పుట (ఒకేరంగుతో) రూ 80 లు.

4. వ పుట (ఒకేరంగుతో) రూ 100 లు.

కొయ్య దిమ్మెలుగల బ్లాకులు అంగీకరించ బడును. ప్రకటనలు. బ్లాకులు పత్రిక వెలువడే తారీఖునకు 10 దినములు ముందే మాకు చేరాలి.

మేనేజరు,

ఆంధ్రమహిళ

7 ఎ. రోజరీచర్చిరోడ్డు.

మైలాపూరు–మద్రాసు 4.